27.12.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:52 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

# ఎన్టీఆర్ కుటుంబం ఏకమైంది!

## చంద్రబాబుకు చరమగీతం పాడను హరికృష్ణ, బాలకృష్ణ సన్నద్ధం?

మంత్రి వర్గ విస్తరణ, మద్య నిషేధ రద్దు ప్రస్తావనలతో తెలుగు దేశం రాజకీయాలు రసకందాయంలో పడ్డాయి. ఏడాదికి పైగా పార్టీ పైన, ప్రభుత్వం పైన పూర్తి పట్టుతో ఏకచక్రాధిపత్యంగా పరిపాలన సాగిస్తున్న చంద్ర బాబు నాయుడుకు ఇవి రెండూ పెద్ద రాజకీయ సవాళ్ళను ఎదురుగా నిల్పాయి.

మంత్రి వర్గ విస్తరణలో చంద్రబాబు చాలా జాగ్రత్తలు పాటించారు. రెండు వందల మంది ఎమ్మెల్యే లున్నప్పుడు, అందులో కేవలం 30 మందికి మాత్రమే అవకాశం ఇవ్వగలిగే టప్పుడు — తక్కిన వారందరికీ అసంతృప్తి కల్గడం చాలా సహజం. ఏ ముఖ్య మంత్రికైనా మంత్రివర్గ విస్తరణ కత్తి మీద సాము క్రిందే లెక్క. అందులోనూ చంద్రబాబు పరిస్థితి మరీ ప్రత్యేకం. ఆయన కేవలం ఎమ్మెల్యేల సహకారంతోనే ముఖ్య మంత్రి కాగలిగారు. ఎన్టీ రామారావు తన వ్యక్తిగత ఛరిష్మాతో ఎమ్మెల్యేలను గెలిపిస్తే — ఎమ్మెల్యేలు తమ వ్యక్తిగత నిర్ణయంతో చంద్రబాబును ముఖ్య మంత్రిని చేశారు. అందువల్ల వారితో మొగమాటాలు అధికం. ఈ నేపథ్యంలో 30 మందిని సంతృప్తి పరచి, 170 మందిని అసంతృప్తికి గురి చేయవలసి రావడంలో ఎదురయ్యే సమస్యలను ఆయన చాలా నేర్పుగా వ్యవహరించ వలసి వుంటుంది. అందర్నీ సమర్థించుకోవడం ఒక ఎత్తయితే — హరికృష్ణను నిలువరించడం ఒక్కటే ఒక ఎత్తు. తెలుగు దేశం పార్టీ రాజకీయ స్వరూపంపై ఎన్టీఆర్ కుటుంబ ప్రభావం చాలా ఎక్కువ. అందులో అప్పుడు హరికృష్ణ ప్రాధాన్యత మరీ ఎక్కువ. లక్ష్మీపార్వతిపై ద్వేషంతో తెలుగు దేశం పార్టీని చీల్చి, చంద్రబాబును గద్దె నెక్కించడంలో హరికృష్ణ చాలా కీలక పాత్ర పోషించారు. ఆ రోజు హరికృష్ణ తెగించి వీధిన పడకుండా వుండి వుంటే — తిరుగు బాటుకు అందరు ఎమ్మెల్యేల మద్దతు లభించేది కాదు. నాదెండ్ల హయాంలో వలె ప్రజల నుంచి ప్రతికూలత ఎదురుకాక పోవడానికి కారణం — హరికృష్ణ, బాలకృష్ణ లిరువురూ చంద్రబాబుతో చేతులు కలపడమే!

అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి ఈ ఇద్దరు ఎన్టీఆర్ కుమారులను ఆసరాగా తీసుకున్న చంద్రబాబు, అవసరం తీరిన తర్వాత వారిద్దరినీ చీపుర పుల్లల వలె విసిరి పారేశారు. హరికృష్ణను మంత్రి వర్గంలోకి తీసుకోక పోవడం ద్వారా చంద్ర బాబు మొత్తం ఎన్టీఆర్ కుటుంబానికి దూరమై పోయారు ; ఎన్టీఆర్‌కు ద్రోహం చేసినట్లే ఆయన కుటుంబానికీ వెన్నుపోటు పొడిచినవాడిగా విమర్శలను ఎదుర్కొంటున్నారు. ఈ నింద పైన పడుతుందని తెలిసీ హరికృష్ణను విస్మరించడం — చంద్ర బాబు రాజకీయ

కొరవ 7 పేజీలో



నెల్లూరు-ప్రకాశం జిల్లాల సరిహద్దుల్లో విమానం కుప్పకూలిన సంఘటనలో చెల్లాచెదరైన విమానభాగాలు, ఖండఖండాలైన వైమానికదళ సిబ్బంది దేహాలు.

# నిప్పులు చిమ్ముతూ నేలవాలిన లోహ విహంగం!

## ఉదయగిరి కందిచేలల్లో తునాతునకలై పడిన వాయు సైనికులు!

నింగిన ఎగిరే లోహ విహంగాలను నేలకు ఆకర్షించే శక్తి ఏదో నెల్లూరు జిల్లాలో వున్నట్లుంది. లేకుంటే ఆకాశంలో అంతు చిక్కకుండా పక్షిప్రాయంగా ప్రయాణమై పోయే విమానాలు నేలను ముద్దాడడ మేమిటి? రెండేళ్ల క్రితం ఒక ఇండియన్ ఎయిర్ లైన్స్ విమానం వెంకటగిరి దగ్గర వరి చేలలో జలకాలాడింది; ఇప్పుడు ఎయిర్ ఫోర్స్ విమానం ఉదయగిరి కంది చేలల్లో తునాతునకలై పడింది. మొదటిది ప్రాణ నష్టం లేకుండా వినోదం మిగిలిస్తే — రెండవది 22 ప్రాణాలను హరించి విషాదం మిగల్చింది.

24 తేది సాయంత్రం 4 గంటల సమయంలో నెల్లూరు — ప్రకాశం జిల్లాల సరిహద్దులో మద్రాసులోని తాంబరం నుంచి హైదరాబాదులోని దుండిగల్ వైమానిక స్థావరానికి వెళ్తుండిన అవ్రో విమానం కుప్ప కూలింది. నిజంగా అది కుప్పకూలి పోవడమే ననాలి. విమాన భాగాలు — తునాతునకలై ఒక కుప్పగా; లోపలుండిన మానవ శరీరాలు ఖండ ఖండాలై మరొక కుప్పగా రాలి పడ్డాయి.

**22 మంది ఆనవాళ్ళు లేకుండా మాడిపోయారు!**

40 సీట్లుండే విమానమిది. మద్రాసు తాంబరం ఎయిర్ స్టేషన్‌లో ఒక సైనిక సంబరంలో పాల్గొన డానికి హైదరాబాదు నుంచి 16 మంది సభ్యులు గల బ్యాండు మేళం జట్టును తీసుకవెళ్ళి, తిరిగి వెనక్కు తెస్తుండినదట. ఆ 16 మందితో పాటు ముగ్గురు పైలట్లు, ఇద్దరు సాధారణ సిబ్బంది వుండినారు. అండమాన్‌లో పనిచేసే ఒక సైనికోద్యోగి ఏదో పని మీద మద్రాసు వచ్చి, విమానం ఖాళీగా హైదరాబాదు వెళ్తున్నదనే వుద్దేశ్యంతో, తన కుటుంబ సభ్యులను చూసి వద్దామనుకొని, అందులో ఎక్కాడట. బయలు దేరేటప్పుడు ఏ సమస్యా లేదు. కాని నెల్లూరు సరిహద్దు దాటే సమయంలో ఒక ఇంజను పనిచేయడం మానేసింది. విమానం పైకి ఎగరడం లేదని; నిర్ణీత ఎత్తులో దాన్ని నిలబెట్టడం సాధ్యం కావడం లేదని పైలట్ తాంబరం స్టేషన్‌కు సమాచారం పంపాడట. వారు వెంటనే — 12 వేల అడుగుల ఎత్తులో నడపమని సూచించారు. ఆ తర్వాత ఏమైంది తెలియ లేదు.

**మొట్టమొదటి మహిళా ఫైటర్ పైలట్ మృతి విషాదకరం!**

అప్పటికది నెల్లూరు — ప్రకాశం సరిహద్దులలో బుక్కాపురం, దూబగుంట గ్రామాల సమీపంలో వుండింది. లోపల ఏమి జరిగిందో కాని, విమానం వేగంగా నేలపైకి దూసుక వచ్చింది. ముందుగా వెనుక భాగం నుంచి పొగలు కన్పించాయి; ఆ తర్వాత మంటలు బయలు దేరి వెనువెంటనే విమానం గిరికీలు తిరిగింది; పల్టీలు కొట్టింది; దగ్గరలో వుండే ఒక కొండను తాకి ధడేలున ప్రేలింది; ఇదంతా క్షణాలలో, క్రింద పొలాలలో పని చేసుకొనే వారు చూస్తుండగానే జరిగి పోయింది. ఆకాశం నుంచి ఏదో నిప్పు ముద్ద నేల రాలినట్లే వుండిందట ఆ దృశ్యం.

కొరవ 10 పేజీలో

# సిమెంట్ పరిశ్రమ భవితవ్యం గోతం బస్తాలతో ఖతం!

నిలకడగా వున్న సిమెంట్ రంగంపై దాడి విసిరింది ప్రభుత్వం. సిమెంట్ ప్యాకింగ్‌కు జనపనారతో చేసిన గోతం బస్తాలే వాడాలని తాజాగా ఉత్తర్వు చేశారు. సిమెంట్ పరిశ్రమల భవిష్యత్తుకిది ఆశని పాతమే!

అది వరకటి రోజుల్లో సిమెంట్ గోతం బస్తాలలోనే వచ్చేది. కాని వాటివల్ల చాలా సమస్యలుత్పన్నమౌతుండినాయి. జనపనార సంచులకు సన్న సన్న సందులుండడం వల్ల సిమెంట్ కారిపోవడం; గాలిలో తేమ ఎక్కువగా వుంటే ప్రదేశాలలో లోపలే గడ్డకట్టి పోవడం జరిగేది. దానితో ఫ్యాక్టరీలన్నీ ప్లాస్టిక్ (హెచ్‌డిపిఇ) సంచులు వాడడం మొదలు పెట్టాయి. పై రెండు సమస్యలు తప్పించు కోవడమే గాక - జనపనార సంచులతో పోలిస్తే వీటి ధర చాలా తక్కువ. 1987లో ఒకసారి జనపనార పరిశ్రమ కష్టాలలో పడినప్పుడు ఇదే నిబంధన విధించారు. ఆ తర్వాత కొంత కాలానికి పరిస్థితి మెరుగు కావడంతో ఆ నిబంధన వుపసంహరించారు.

ఒకరి బాగుకు ఇంకొకర్ని చంపాలా?

ఇప్పుడు మళ్లీ ఈ నియమం పెట్టడానికి కారణం బోధ పడడం లేదు.

కొరవ 7 పేజీలో

# ధనం లేకున్నా అంకెలు ఘనం!

9 ప్రణాళికలో 8 లక్షల 70 వేల కోట్లు ఖర్చు పెట్టాలని ప్రణాళిక సంఘం నిర్ణయించింది. అంటే ఏడాదికి లక్షా 75 వేల కోట్లు! అంకెలు చాలా ఘనంగా కన్పిస్తున్నాయి. కాని, అంత ధనం ఎక్కడ నుంచి తెస్తారో ప్రణాళికా సంఘం చెప్పడం లేదు.

ఈ ప్రణాళికా ప్రతిపాదనలలో ప్రధాన విశేషం - గ్రామీణా భివృద్ధిని, వ్యవసాయా భివృద్ధిని విడివిడిగా చూపడం. దీని వల్ల నీటి పారుదల ప్రాజెక్టులకు ప్రత్యేక ప్రాధాన్యత ఏర్పడుతుంది. దేశంలో, వివిధ స్థాయిలలో నిర్మాణంలో వున్న నీటి పారుదల ప్రాజెక్టులు పూర్తి చేయటానికి 20 వేల కోట్ల రూపాయలు అవసరం వుంటుందని అంచనా. ఈ ప్రణాళికలో వాటికి పూర్తిగా నిధులు కేటాయిస్తే - వ్యవసాయోత్పత్తి బాగా పెరుగు తుంది.

కొరవ 7 పేజీలో

## నేటిభారతం

తిరుమూరు సుధాకర రెడ్డి

### హిందీ తారలపై పన్నుల విడుగులు!

బిగ్ బజెట్ల దెబ్బ తగిలిందేమో - బాలీవుడ్ తారలు ఇన్‌కంటాక్స్ కోరల్లో ఇరుక్కున్నారు! కనీవినీ ఎరుగని భారీ స్థాయిలో హిందీ తారల ఇళ్లపై ఆదాయం పన్ను అధికారులు దాడి జరుపు తున్నారు. ఇప్పటి వరకు 16 మంది ఫిలిం ప్రముఖుల ఇళ్లపై ఇన్‌కంటాక్స్ పిడుగులు పడ్డాయి! మాధురీ దీక్షిత్, షారూఖ్ ఖాన్ వంటి హేమాహేమీలను కూడా అష్ట దిగ్బంధనం చేశారు. దాంతో షూటింగ్‌లు నిల్చి పోయాయి. మూడు నెలల క్రితం పన్నులు సరిగా చెల్లించి నందుకు గాను షారూఖ్ ఖాన్ ఇన్‌కంటాక్స్ వారి సత్కారం కూడా అందుకొన్నాడు! ఐనా సరే! అతని ఇంటిని కూడా వదలి పెట్టలేదు. తారలతో బాటు వారి సెక్రటరీలు కూడా సోదాకి గురి కావడం ఈసారి విశేషం!

### కాదేది కొరియర్ కనర్హం!

మత్తు పదార్థాల దొంగ రవాణాకు ఇప్పుడు కొత్త రూటు కనిపెట్టారు స్మగ్లర్లు! అది కొరియర్ సర్వీస్! ఢిల్లీలోని ఒక పెద్ద కొరియర్ సర్వీస్ ద్వారా గల్ఫ్ దేశాల మీదుగా ఆమ్‌స్టర్‌డమ్ చేరేటట్లు రెండు పార్శిల్ పెట్టెలు బుక్ చేయబడినాయి. అవి ఢిల్లీ విమానాశ్రయంలో కస్టమ్స్ అధికారుల కంట బడినాయి. 'మేడి పండు చూడ మేలిమై యుండు' అనే పద్యం గుర్తు కొచ్చిందేమో! ఆ పెట్టెల పొట్ట విప్పి చూశారు! ఆ పెట్టెల పొరల్లో 74 కిలోల హషిష్ దాగి వుందట. అది సుమారు 20 లక్షల ఖరీదు చేస్తుందట! గంజాయి గుమగుమలు తగల కుండా పెట్టెలో ఎండు మిరపకాయల్ని దట్టించారట! అయినా కస్టమ్స్ వాళ్ల కళ్లలో కారం కొట్టలేక పోయారు స్మగ్లర్లు!

### సంపాదకురాలుగా జయలలిత!

జయలలిత ఎంతటి సంపాదనా పరురాలో స్పష్టంగా నిరూపించారు [illegible]! అయితే అదంతా అక్రమ సంపాదన అని రుజువు చేయడంలో ఆయన ప్రభుత్వం వెనక బడిపోయింది. దాంతో జయలలిత రాజకీయంగా మళ్లీ ముందడుగు వేసే ప్రయత్నాలు ప్రారంభించింది. పత్రికా సంపాదకురాలిగా ఆమె 1997 లో కొత్త అవతారం ఎత్తుతుందట. ఆమె సంపాదకత్వంలో నాలుగు ఆంగ్ల పత్రికలు వెలువడ నున్నాయని ఆమె కార్యదర్శి, అంతరంగికుడు వి. భాస్కరన్ వెల్లడించారు. వీటిలో సినీ ఇండియా ఫిలిం పత్రిక కూడా వుంటుందట. ఈ పత్రికల ద్వారా ఆమె మేధావులతో, రచయితలు, అర్టిస్టులతో సాన్నిహిత్యం ఏర్పరచుకొని దీక్షగా సత్కాలక్షేపంగా సాగిస్తుందట! పత్రికల పవర్ ఏమిటో పవర్ పోగొట్టుకున్నాక గాని తెలిసి రాలేదు పాపం జయలలితకు!

### చిరునవ్వును సరిదిద్దుకోండి!

మీ మందహాసం అందంగా లేదా? మీ చిరునవ్వు సిరివెన్నెలలు కురిపించడం లేదా? మీ అభిమాన తారలు రోజాలాగానో, రజనీ కాంత్ లాగానో మీరూ నవ్వ గలిగితే బాగుండును అనుకొంటున్నారా? అయితే ఢిల్లీలోని ప్రఖ్యాత దంత వైద్యులు డాక్టర్ ఎస్. ఉమ్రేగార్ని సంప్రదించండి - మీ చిరునవ్వు ఎవరి చిరునవ్వులా వుండాలను కొంటున్నారో - వారి ఫోటోను పట్టుకెళ్ళడం మాత్రం మరువ వద్దు. ఆ ఫోటోలో వున్న చిరునవ్వు సమానా క్షణాలలో మీ సొంత మౌతుంది! ఇదెలా సాధ్య మంటారా? అంతా కంప్యూటర్ మహిమ!

### పంచదారలో ప్రపంచ రికార్డ్!

దేశంలో ఒకవైపు గోధుమల కరువొచ్చి గొడవగా వుంటే మరో వైపు చక్కెర ఎక్కువై రైతుల పరిస్థితి చేదుగా, బాధగా తయారైంది. ఈ ఏడాది మన దేశంలో 16 మిలియన్ టన్నుల పంచదార ఉత్పత్తి అయింది. ఇది ప్రపంచ రికార్డు అంటున్నారు. చెరకు పంట సాగు విస్తీర్ణంలో ఎలాంటి పెరుగుదల లేకుండానే ఈ అధిక దిగుబడి రావడానికి కారణం చెరకు పంటపై జరిగిన పరిశోధనలే!

పంచదార నిల్వలను విదేశాలకు ఎగుమతి చేయాలని ఇటీవల పార్లమెంటులో ప్రవేశ పెట్టిన

కొరవ 7 పేజీలో

# సెన్సెక్స్ మూడువేలు తగ్గకుండా యుటిఐ రక్షణ కవచం!

షేర్ మార్కెట్ పతనం కాకుండా కాపాడడానికి యుటిఐని రంగంలోకి దించారు కేంద్ర ఆర్థిక మంత్రి చిదంబరం. బొంబాయి సెన్సెక్స్ 3వేల పాయింట్లకు తగ్గకుండా నిలపమని సూచించారట ఆయన. అందువల్ల వారు షేర్లు పడిపోతాయనే సందేహం వచ్చినప్పుడల్లా కొనుగోళ్లు జరుపు తున్నారు. దీనితో ఇండెక్స్ 200 పాయింట్లు పెరిగింది. ఇదొక సంతోషించదగిన పరిణామం.

అయితే షేర్ మార్కెట్‌ను నియంత్రించ గలిగినంత ధనం యుటిఐ దగ్గర లేదు. 60వేల కోట్లకు పైగా నిధులున్న ఈ బృహత్ సంస్థ సైతం షేర్ల అస్తవ్యస్త పరిస్థితులతో ఆర్థిక సమస్య లెదుర్కొంటుంది. పాత స్కీంల రిడంక్షన్ ఫలితంగా వీరి నిధులు హరించుక పోయాయి. అందువల్ల వీరు బ్యాంకుల సహకారం తీసుకొంటున్నారు. ఫిక్సెడ్ డిపాజిట్లలో 5శాతం షేర్లపై పెట్టుబడి పెట్టవచ్చునని ఇటీవలే కేంద్ర ఆర్థిక మంత్రి బ్యాంకులకు అనుమతి ఇచ్చారు. ఆ డబ్బును యుటిఐ ద్వారా వాడుతున్నారు.

ఇదివరకు కూడా బ్యాంకులు యుటిఐ-64 పథకంలో పెట్టుబడి పెట్టివి. అయితే పూర్వం వలె ఇప్పుడు దానికి పన్ను మినహాయింపు లేకపోవడంతో బ్యాంకులు విత్‌డ్రా అయిపోయాయి. దీనివల్లే యుటిఐ బ్యాంకులకు 4వేల కోట్ల రూపాయలు తిరిగి చెల్లించ వలసి వచ్చింది. ఇప్పుడు తిరిగి అదే బ్యాంకులు అదే యుటిఐని ఆశ్రయిస్తున్నాయి. బ్యాంకులు తనకిచ్చే నిధులకు 16శాతం ఆదాయం గ్యారంటీ కల్పిస్తున్నది యుటిఐ.

దీనితోపాటు ఎల్ఐసి, జిఐసి వంటి సంస్థలూ షేర్ మార్కెట్‌పట్ల శ్రద్ధ చూపి, తమ నిధులను మళ్లిస్తే మార్కెట్ త్వరలోనే కుదుట పడుతుంది.

# రాబందులేనయం

రాజకీయాలలో నీతి, నియమాలు ఏనాడో అదృశ్యమై పోయాయి. రాజకీయ వాదులు సిగ్గు, బిడియాలు ఎప్పుడో వదిలేశారు. అంచనాలకందనంత బొక్కడం, కల్పించిన గడ్డి నంతటినీ గతికడం పదవుల పరమార్థంగా మారిపోయింది. ఢిల్లీ నుంచి గల్లీ వరకు స్వామ్య జాఢ్యం రాజకీయ వాదుల 'ప్లేగు' కంటే తీవ్రంగా వ్యాపించి వున్న నిజం ప్రతి దినం పత్రికలు కోడైకూస్తున్నాయి. కాని ప్రజలలో స్పందన లేదు; రాజకీయ వాదులలో మార్పు లేదు.

తూర్పుగోదావరి జిల్లా నగరం నియోజక వర్గం తెలుగు దేశం ఎమ్మెల్యే పులపర్తి నారాయణ మూర్తి - తుఫాన్ బాధితుల కోసం దాతలు పంపిన బియ్యాన్ని అక్రమంగా దాచి పెట్టుకున్నారని సాక్ష్యాలతో సహా రుజువైంది. ఈ దగుల్బాజీ అర్జనలో పంపకాల తేడా వచ్చి ఆయనకు తోడు దొంగగా వున్నతనే నిజం బయట పెట్టినట్లున్నారు. అతన్ని పార్టీ నుంచి సస్పెండ్ చేశారు. కేసు కూడా పెట్టారు.

ఈ ఎమ్మెల్యే అరగించ బోయిన బియ్యం చాలా కొంచమే! నేతల అవినీతి కథలతో పోల్చినప్పుడు ఇది అత్యల్పం. కాని ఇక్కడ ప్రాధాన్యత ఎంత తిన్నారన్నది కాదు - నీచబుద్ధి ఎంతకైనా ప్రేరేపిస్తుందని తెలుసుకోవడమే. సాధారణ పరిస్థితులలో ప్రభుత్వ ధనాన్ని కొల్లగొట్టడం వేరు - ఆపత్సమయంలో ఆపన్నుల నోటి దగ్గర కూడును కొట్టుక తినడం వేరు. ఈ బియ్యం తుఫాన్ బాధితుల నుద్దేశించినవి. ప్రకృతి ప్రకోపానికి ఇల్లు వాకిలి కోల్పోయి, ఆప్తులను పోగొట్టుకొని, తినడానికి తిండి, వుండడానికి గూడు లేని దయనీయ పరిస్థితులలో వున్న అభాగ్యులకు సహృదయత్వంతో, సానుభూతితో సోదర ప్రజలు పంపించిన నాలుగు మెతుకులను సైతం మధ్యలో దోచబడి అరగించడానికి చూసిన నీచులకు ఏ శిక్ష వేసినా తక్కువే! రాబందుల కంటె హీనులు వీరు - అవి కేవలం ప్రాణం లేని కళేబరాలను మాత్రం పీక్కొని తింటాయి. వీరు ప్రాణంతో వున్న మనుషులను అట్టేబ్టి కొరుక్కొని తినాలని చూస్తున్నారు.

దేశమంతటా వ్యాపించి వున్న ఈ అవినీతి మహమ్మారిని, అల్పబుద్ధి గాళ్ళను పరిహరించే వారు ఎప్పుడొస్తారోనని దేశం యావత్తు ఎదురు చూస్తున్నదిప్పుడు. ఫిఫి అవినీతి కథలు, జయ లలిత బంగారు గనులు, లల్లూ ప్రసాద్ యాదవ్ పచ్చిగడ్డి ఫలహారాలు, సుఖ్‌రాం నోట్లకట్టలు, సతీష్‌శర్మ పెట్రోలు బావులు, పీలాకోల్ ఇళ్ళ భోజనాలు. ఇట్లా ఒకటేమిటి - సవాలక్ష సంఘటనలు వెలికి వచ్చి రాజకీయాలలోని కుళ్ళును పరమ వికృతంగా ప్రదర్శిస్తున్నాయి. ఇవన్నీ తెలిసిన కథలు. తెలియకుండా ఎన్నివేల మంది రాజకీయ వాదులు ప్రజల సొత్తును పటిక బెల్లం వలె అరగించి బొజ్జలు పెంచుకొని వున్నారో ఊహించలేము. సుఖ్‌రాం, జయలలితలను చూసిన తర్వాత గత పాతికేళ్లుగా రాజకీయం వెలిగి పదవు లనుభవిస్తున్న ప్రతి నేత ఇంటినీ సోదా చేయడం అవసర మన్పిస్తున్నది. మునిసిపల్ కౌన్సిలర్ స్థాయి నుంచి కేంద్ర మంత్రుల వరకూ విచక్షణ లేకుండా దర్యాప్తు జరిపిస్తే ఎన్ని లక్షల కోట్ల అక్రమార్జన బయట పడుతుందో నన్పిస్తుంది. అవినీతి విషవృక్షం ఒక్కొక్క రాజకీయవాది ఇంట పాతాళం లోతుకు వ్రేళ్ళు నాటుకొని, మొగ్గలు తొడిగి, విషపు పూలు పుష్పిస్తున్నది. ఈ భయంకర నీచత్వాన్ని రూపు మాపకపోతే రాజకీయ వాతావరణమే కలుషితమై పోతుంది!

కాని, ఎవరు చేయాలాపని? అధికారంలో వుండే రాజకీయ వాదుల నుంచి ఆ పుణ్య కార్యం ఆశించడం మహాపాపం! వారూ ఈ తానులోని కొకలే! ఏ నేత, ఏ పార్టీ ఇందుకు మినహాయింపు కాదు. గంజాయి వనంలో తులసి మొక్క బ్రతకదు. మొలకెత్తినా - అదిమి పారేస్తారు తప్ప చిగురువేసి, రెమ్మ తొడగనివ్వరు. దేశంలో, రాష్ట్రాలలో పరిపాలన చేస్తున్న నేతలలో అటువంటి సత్శీలురు ఎవరూ లేరు. ప్రధాని దేవెగౌడను చూడండి - కాంట్రాక్టర్ల నుంచి లక్షా, రెండు లక్షలు కూడా ముడుపులు అందుకొని, మూట కట్టుకొన్న చవకబారు రాజకీయ వాది ఆయన. రాష్ట్రంలో చంద్రబాబును చూడండి - ఎన్‌టిఆర్ నీడలో ఆంధ్ర దేశాన్ని కొల్లగొట్టి పూరిపాకల స్థాయి నుంచి వైట్‌హౌస్ లెవల్‌కు ఎదిగిన అవినీతి చరిత్ర ఆయనది. బిజెపి అయినా, కమ్యూనిస్టులైనా కూడా అంతే! పవిత్రులెవరూ లేరు.

ఈ కలుషిత వాతావరణంలో రాజకీయ వాదుల కుళ్ళును కడిగే పని రాజకీయ వాదుల నుంచి ఆశించడం వ్యర్థం. న్యాయస్థానాలు కొంత వరకు ఆ బాధ్యతను స్వీకరించాయి. కాని, అది సరైన మార్గం కాదు. న్యాయ స్థానాలలోని అవినీతిని ఎవరు క్షాళన చేస్తారు? జడ్జిమెంట్ల పేరుతో కోట్ల రూపాయల ప్రజాధనాన్ని కొల్లగొట్టిన అధర్మ ప్రభువుల భాగోతం చదువుతూనే వున్నాం కదా? హైకోర్టులలోనూ తరచుగా న్యాయమూర్తుల ప్రవర్తన శంకించ వలసిన తీరులో వుంటున్నది. పోలీసు లేదా సిబిఐ వంటి యంత్రాంగంపై ఆధారపడడం మరి తెలివి తక్కువ. రాజకీయ వాదులలో కంటె అధికంగా అవినీతి విషపు తెగులు అంటుకొని వున్న వ్యవస్థ అది. అధికారుల అండతోనే అవినీతి నడుస్తుందన్న సంగతి మరువ కూడదు.

జమీన్‌రైతు

పరిపాలన కవసరమైన విభాగాలన్నీ లంచాల జబ్బుతో మంచం పట్టివున్నప్పుడు - తమను తాము రక్షించు కోవడం ఒక్కటే ప్రజలకు మిగిలిన దారి. ప్రజలే ఉద్యమించి ఈ దీర్ఘ రోగాన్ని తరమాలి తప్ప! ఎవరో వచ్చి ఏదో చేస్తారని భ్రమపడడం వెర్రితనం. స్వాతంత్ర్య కాలం నాటి దేశభక్తి స్ఫూర్తితో ప్రతి భారతీయుడూ ఈ అవినీతి విషనాగును హతమార్చడానికి ప్రయత్నిస్తే తప్ప, ఫలితం వుండదు. పైగా అది మొండి ఇబ్బంది వంటిది. తల నరికినా తోకతో ప్రాణం నిలుపు కొంటుంది. తోక కూడా త్రెంచినా ఉరుట్లో చిగుర్లు వేస్తుంది.

నిజానికి అవినీతి తల్లివేరు స్థిర పడివుండేది ప్రజల మానసాలలోనే! బస్ టికెట్ నుంచి పాల ప్యాకెట్ వరకూ అడ్డదారిలో తెచ్చుకోవాలనే తత్వం కల్గిన జనమే ఈ జాడ్యాన్ని సజీవంగా వుంచుతున్నారు; ఎరువువేసి, నీళ్లుపోసి పెంచుతున్నారు. ప్రజలలో నిజాయితీ లోపించడం వల్లే నేతలు నీతి తప్పుతున్నారు. మార్పు అనేది ఆశిస్తే అది మన మానసాలలో నుంచే మొదలు కావాలి! లంచం పుచ్చుకోవడం వలెనే, ఇవ్వడమూ నీతి బాహ్యమైన చర్య అని గ్రహించ గల్గినప్పుడే సమాజం బాగుపడు తుంది. నీతి తప్పిన వారని తెలిసిన వెంటనే ఓట్ల కోసం గడప దగ్గరకు వచ్చినప్పుడే తిరస్కారపు పేడనీళ్లు ముఖాన చల్లగల్గితే రాజకీయం క్షాళనమౌతుంది.

నేతలు తమ అక్రమార్జన నుంచి ఎన్నికల రోజు విసిరేసే నోట్లకోసం ఆత్రంగా ఎదురు చూస్తుంటాం మనం. ఆ క్షణంలో వారి తప్పులు మరచిపోయి, వారిచ్చే వాగ్దానాలు, విరాళాలను స్వీకరిస్తాం. ఈ ధోరణి ప్రజలు మానుకోనంత కాలం తుఫాన్ బియ్యం తినే ఎమ్మెల్యేలు, పచ్చగడ్డి తాము తిని పశువులను మాడ్చి చంపే లల్లూ రాబందులు నిక్షేపంగా రాజ్యం చేస్తూనే వుంటాయి.

---

## జమీన్‌రైతు

27.12.46

పేజీలు:8 వెల: 0-1-6

### ప్రకాశం గారికి ప్రాణాపాయం తప్పింది

మద్రాసు ప్రధాని ప్రకాశం పంతులు గారు 22వ తేది ఉదయం ఢిల్లీలో తన బస యందు స్నానము కొట్టులోనికి పోయి, అక్కడే పడి పోయి మూల్గుతూ యుండినారు. కొట్టు నుండి బయటకు రావడం ఆలస్యమైనందున వారి ప్రైవేటు సెక్రటరీ శ్రీనివాస రావుగారు తలుపు తీసి చూసేసరికి మూలుగుతూ బోర్లపడి పోయి యుండినారు. వెంటనే పడక మీదకు పట్టి డాక్టరును రావించి కొన్ని యింజక్షన్లు ఇప్పించారు. ఒక గంటకు లోపుగానే స్మృతికి వచ్చి యిపుడు ఆరోగ్యముగానే యున్నారు. అపాయం జరిగిన సంగతి వినగానే పట్టాభి సీతారామయ్య మున్నగు వారు వచ్చి పరామర్శించి వెళ్లారు. 24వ తేది మద్రాసుకు బయలుదేరి ఆ దినం సాయంత్రమే చేరారు. మద్రాసులో పలువురు చూచి కుశల మడుగగా ఉత్సాహముతో జవాబు చెప్పారు.

అజాత శత్రు

-అభినయం-

రచయిత:

శ్రీ చంద్రశేఖర శస్త్రి

రచన సులభశైలి, ముద్దులొలికే అచ్చ తెనుగు పదాలు దొర్లించి అందం తెచ్చారు కవి. గంభీర భావాలు మెరుపు తీవెల్లా మెరుస్తున్నవి. మెదడుకు మేత పెడుతూ.

-ఆచార్య ఆత్రేయ

82 పేజీలు:

శుభ్రమైన తెల్లని కాగితం

మూల్యం ముప్పావలా

వి.వి. నాయుడు అండ్ సన్సు,

బుక్ సెల్లర్సు, పబ్లిషర్సు, నెల్లూరు.

### రాష్ట్ర విభజన విషయమై పటేల్

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### విముఖత - పట్టాభి పట్టుదల

7వ తేది జరిగిన రాజ్యాంగ పరిషత్తు కాంగ్రెసు సభ్యుల తొలి సమావేశంలో, యిలాంటి తీర్మానము లేవి ప్రవేశ పెట్టుటకు వీలులేదనుటతో డాక్టర్ పట్టాభి సీతారామయ్యకు, కాంగ్రెసు అగ్రనాయకులకు తీవ్రమైన వాదం జరిగింది.

నెహ్రూ: ఈ తీర్మానమును ప్రవేశపెట్ట నట్లయితే, అనేక సవరణలు, ఇంకా అనేక కొత్త తీర్మానములు ప్రతిపాదింప బడవచ్చు. స్వాతంత్ర్య పురోగమనానికి ఇది ఆటంక మవుతుంది.

కొరవ 11 పేజీలో

---

## జనవాణి

# రైతులకుపయోగపడని పంట భీమా పథకం ఎందుకు?

కరువు కాలంలో, తుఫాను సమయంలో నష్టపోయే రైతాంగానికి ప్రస్తుతం అమలులో వున్న భీమా పథకం నిరుపయోగ మౌతూంది. వేలాది రూపాయలు పెట్టుబడి పెట్టి నష్ట పోతున్న రైతుల బాధలు ఆలకించే వారు లేరు. ఈ పథకానికి కేంద్ర – రాష్ట్రాలు 2:1 నిష్పత్తిలో నిధులు సమకూరు స్తున్నాయి. సహకార వాణిజ్య గ్రామీణ బ్యాంకులలో రుణం తీసుకొన్న రైతులకు తప్ప ఈ పథకం ఇతర రైతులకు వర్తించడం లేదు. పైగా, భీమా కేవలం బ్యాంకు రుణానికే తప్ప, పంట నష్టానికి కాదు. అప్పుకు భీమా మొత్తం జమ కట్టుకొని, రైతులకు మొండి చేయి చూపు తున్నారు. ఇది అన్యాయం. ఈ పథకం ద్వారా ఖరీఫ్ సీజన్‌లో వరి, జొన్న, మినుములు, వేరుశనగకు మాత్రమే భీమా చేస్తారు. రబీ సీజన్‌లోని పత్తి, మిర్చి, పొగాకు వంటి వాటికి ఇది వర్తించదు. బ్యాంకులలో తీసుకొన్న ఋణాలకు ప్రీమియం వసూలు చేసి కార్పొరేషన్‌కు పంపిస్తారు. ఆచరణలో ఈ పథకం విఫల మయ్యింది. మండలాన్ని యూనిట్‌గా తీసుకొని అంచనా వేయడం సరికాదు. గ్రామాన్ని యూనిట్‌గా తీసుకోవాలి. భీమా మొత్తం పరిధి 10 వేల నుంచి 25 వేలకు పెంచాలి. నికర సగటు దిగుబడికి, పంట నష్టం వాటిల్లిన సీజన్ దిగుబడి తేడాను గుర్తించి రైతులకు నష్ట పరిహారం చెల్లించ కుండా తీసుకొన్న అప్పుకు వడ్డీకి జమ చేసుకోవడం అన్యాయం. రైతులకు ఏ మాత్రం ఉపయోగ పడని ఈ భీమా విధానాన్ని పునః సమీక్షించాలి.

కోడూరు వివి భవానిశంకరి

### చిత్తశుద్ధిలేని ప్రభుత్వం

గతంలో జమీన్‌రైతు ప్రకటించిన విధంగా మద్యపాన నిషేధాన్ని నీరు గార్చేందుకు అన్ని విధాలా ప్రయత్నాలు జరుగు తున్నాయి. ఇటీవల మేధావుల సమావేశమని పెట్టి అందులో మద్య నిషేధం అమలు పరచడం లోని వైఫల్యాలను ఎంత గట్టారు. ఇటువంటి వైఫల్యాలతో ధ్రాన్ని

# జిప ఛేర్మన్ అవినీతిపై అయ్యవార్ల దండయాత్ర!

ఇప్పటి వరకు జిల్లాలోని పలు విమర్శలతో సతమత మవుతున్న జిప ఛైర్మన్ డాక్టర్ నాగభూషణమ్మపై ఉపాధ్యాయ సంఘాలూ కొత్తగా ధ్వజ మెత్తాయి. టీచర్ల నియామకాలు, ప్రమోషన్లు, బదిలీలల్లో అంతులేని అవినీతికి పాల్పడ్డ ఛైర్మన్ పైన, ఆమె భర్తపైన సిబిసిఐడి విచారణ జరిపించాలని డిమాండ్ చేశారు. యుటిఎఫ్, ఎపిటిఎఫ్, ఎడియుఎస్, ఎపిటిఫ్ (హైదరాబాద్) నాయకులు 21 తేది ఈ విషయమై జిల్లా కలెక్టర్‌ను సంయుక్తంగా కలసి అభ్యర్థించారు. నాగభూషణమ్మ పదవి స్వీకరించి నప్పటి నుంచి టీచర్ పోస్టింగులకు వేలం వెట్టినట్లు వేతలు అరోపిస్తూ, విచారణ జరిపే వరకు ఛైర్మన్‌కు నియామకాల అధికారాన్ని తొలగించా లన్నారు.

ఛేర్మన్ చేసిన అక్రమ పనులకు సంబంధించిన కాగితాలు ఒక పెట్టె నిండా పెట్టి సమర్పించారు. 1996-97 విద్యా సంవత్సరం ప్రారంభంలో ఛేర్మన్ 500 బదలీలు చేస్తే 54 మాత్రమే సక్రమంగా ఉన్నాయని సిఆట ఉత్తర్వులు ఇచ్చిన విషయం దీనిలో ఉదహరించారు. బదలీపై నిషేధం వున్న కాలంలో ముడుపులు తీసుకొని 300 మందికి డిప్యుటేషన్లు వేశారని, కొత్త పోస్టింగుల విషయంలో కూడా అనేక అవకతవకలు జరిగాయని ఆరోపించారు. కొందరు ఉపాధ్యాయులు రెండు నెలల వ్యవధిలో నాలుగు ప్రాంతాలకు మారారని; జిల్లా పరిషత్ నిర్వహణ పైరవీకారుల పనులుగా మారి పోయిందని పలు ఉదాహరణలు నాయకులు ఎత్తి చూపారు. కలెక్టర్‌ను కలిసిన వారిలో టి. కొండాచారి, కె. గాలయ్య, కె. సుబ్బా రెడ్డి, ఎం. నాగభూషణం, కె. పోలయ్య తదితరులు ఉన్నారు.

### దర్యాప్తు కోరుతున్న ఉపాధ్యాయ సంఘాలు

## మద్య నిషేధంలో ప్రభుత్వ వైఖరి ఏమిటి?

మద్య నిషేధాన్ని పకడ్బందీగా అమలు జరుపుతామని ఒక వంక ప్రకటిస్తూనే; దానికి భిన్నంగా అధికార పార్టీ శాసన సభ్యులు, మంత్రులు నిషేధాన్ని నిర్వీర్యం చేసేందుకు అసంబద్ధ ప్రకటనలు చేయడాన్ని, జిల్లా మద్య నిషేధ సమన్వయ సమితి ఆధ్వర్యంలో జరిగిన సమావేశంలో దుయ్యబట్టారు. సమితి సభ్యురాలు మహేశ్వరి అధ్యక్షతన జరిగింది. సమావేశం మద్య నిషేధం విషయంలో ప్రభుత్వం చట్టం చేసి గమ్మున కూర్చొందని, అమలుకు పటిష్టమైన ప్రణాళిక రూపొందించ లేదని విమర్శించింది. మద్య నిషేధంపై ప్రజలను చైతన్య పరచలేదని, గ్రామ స్థాయి సదస్సులు, బహిరంగ సభలు, ఎందుకు ఏర్పాటు చెయలేదని సమావేశం ప్రశ్నించింది. మద్య నిషేధానికి తూట్లు పొడవాలని చూస్తున్న అధికార పార్టీ సభ్యులు, శాసన సభ్యులు రాబోయే ఎన్నికల్లో తగిన మూల్యం చెల్లించక తప్పదన్నారు. నిషేధంలో దేశానికే ఆదర్శమైన జిల్లా ప్రజలు మద్య నిషేధాన్ని ఖచ్చితంగా అమలు జరపాలని ప్రభుత్వానికి గ్రామ గ్రామాల నుంచి అర్జీలు పంపాలని సూచించారు. సమావేశాన్ని సమన్వయ కమిటీ జిల్లా కన్వీనర్, న్యాయ వాది జి. రామగోపాల్ ఏర్పాటు చేశారు.

## చౌకదుకాణాలకు దరఖాస్తు చేసుకోండి

జిల్లాలో ఖాళీగా వున్న 118 చౌక దుకాణాలకు డీలర్లుగా మహిళలను నియమిస్తున్నట్లు జిల్లా కలెక్టర్ చెప్పారు. జనవరి 3వ వారంలో వీటిని భర్తీ చేస్తారట. నెల్లూరు డివిజన్‌లో 12, కావలిలో 46, గూడూరులో 60 ఖాళీలున్నాయి. 10 తరగతి చదువుకున్న మహిళలు దరఖాస్తులు చేసుకోవచ్చు. ఇంటర్వ్యూలు జరిగిన రోజే నియామక ఉత్తర్వులు ఇస్తామంటున్నారు కలెక్టర్ గారు.

కొరవ 11 పేజీలో

వర్తమాన సమాజం నిర్వహించిన చిత్రకళా ప్రదర్శనలో ప్రముఖ చిత్రకారుడు మీడా ఓబులయ్యను సన్మానిస్తున్న జాయింట్ కలెక్టర్ డాక్టర్ ఎస్. నాగేశ్వర రావు, ప్రక్కన సివి రమణారెడ్డి, ఇ. శ్రీనివాసరావు, పొన్నాల రామసుబ్బారెడ్డి, ఎం. ధర్మారెడ్డి, తదితరులు.

## సణుగుడు

### * మంత్రిత్వాలు అశాశ్వతం – మంచిపనులే శాశ్వతం!

సర్వేపల్లి ఎమ్మెల్యే శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మంత్రి అయ్యారు. జిల్లాలో పరసారత్నంకు కూడా మంత్రి పదవి లభించినప్పటికి రాజకీయంగా చంద్రమోహన్‌రెడ్డి పదవీ ప్రాప్తమే ప్రాధాన్యత కల్గిన పరిణామం. పరసా రత్నం రాజకీయాలకు కొత్త, సూళ్లూరుపేటకు మాత్రం పరిమితమైన ఎమ్మెల్యే, ఇతర ప్రాంతంతో కాని, వ్యక్తులతో గాని పరిచయాలు కూడా లేవు; చొరవ తీసుకొని పరిచయం పెంచుకొనే తత్వం, అవకాశం కూడా లేవు. వేనాటి సోదరుల ఇగో సంతృప్తి పడడంవరకే రాజకీయంగా ఆయన పదవి వుపకరిస్తుంది. వారిమాట ముఖ్యమంత్రి విన్నాడో లేదో ఆ పరమాత్ముడికె రుక గాని, తమ వాడు మంత్రయ్యాడని సూళ్లూరుపేటలో చెప్పుకొనే అవకాశం ఆ సోదర ద్వయానికి లభించింది. రత్నం నెల్లూరు రాకను అంత ఆర్భాటంగా జరిపించడంలోని అంతర్యమదే! కాని రత్నం అంత తొందరగా ఇంకొకరికి కొరుకుడు పడే ఘటం కాదు. పైకి కన్పించేటంత మెతకా కాదు. నొప్పించ తానొవ్వక సమయ స్ఫూర్తితో తన పని తాను చేసుకోపోయే చాకచక్యం వుంది. ఏమైనా కొత్త రాజకీయ వంటకం అది; తింటే కాని రుచి ఏమిటో చెప్పలేము.

### డోలేంద్ర

కాని చంద్రమోహన్ రెడ్డి పరిస్థితి అందుకు భిన్నం. పదిహేనేళ్ళ నుంచి రాజకీయాలలో బాగా నలిగి, రాటు దేలిన ఘటమది. తండ్రి మూర్తిత్వం, మేనమామ రాజకీయ శైలి

కొరవ 7 పేజీలో

డాక్టర్ వై.ఎస్. రెడ్డి పొగతోటలో నూతనంగా నిర్మించిన ఆసుపత్రిని ప్రారంభించిన ప్రముఖ సర్జన్ కె.కె. రామలింగం, ప్రక్కన డాక్టర్లు ఎ. మహాదేవయ్య, జె. శేషారెడ్డి.

# అభిమానపు జల్లులో తడిసి ముద్దయిన మంత్రి!

క్యాబినెట్ మంత్రి పదవి స్వీకరించాక తొలిసారిగా 26తేది నెల్లూరు వచ్చిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి రైల్వే స్టేషన్‌లో అపూర్వ స్వాగతం లభించింది. వేలాది అభిమానులు, పార్టీ నాయకులు కార్యకర్తలు చూపిన అభిమానం, కురిపించిన పూల జల్లుల మధ్య మంత్రి తడిసి ముద్దయ్యారు. మంత్రి రాకను పురస్కరించుకొని ఆయన అభిమానులు కొనంతా హడావుడి సృష్టించేశారు. స్వాగతం పలికే బ్యానర్లు, ఆర్చీలు, జెండాలలో సింహపురికి సరికొత్త సొగసులు దిద్దినట్లనిపించింది. కోట నుంచి నల్లపురెడ్డి కుటుంబ అభిమానులు కార్లలో, సర్వేపల్లి అభిమానులు ట్రాక్టర్లు, లారీల్లో తరలి వచ్చారు. వీరందరికి బ్రేక్‌ఫాస్టుగా పులిహార కూడా ఏర్పాటు చేశారు. ఎమ్మెల్యేలలో గొమ్మి లక్ష్మయ్య నాయుడు, ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి స్టేషన్‌కు వచ్చి చాలా సేపు వెయిట్ చేసి మంత్రితో కలసి ఊరేగారు. మంత్రొచ్చిన పినాకినీ ఎక్స్‌ప్రెస్ రాక కాసింత ఆలస్యమైంది. స్టేషన్‌లో సోమిరెడ్డి వర్గీయుల కన్నా, మాజీ మంత్రి రమేష్‌రెడ్డి అంతరంగికుడైన వై.వి. రామిరెడ్డి హడావుడి ఎక్కువగా కనపడింది. మంత్రి కాలినడకన వస్తున్నప్పుడు పోలీసుల కన్నా ముందుగా జనాన్ని తోస్తూ మార్గ నిర్దేశకుడయ్యా రాయన. అభిమానుల తొక్కిసలాట వల్ల మంత్రి నలిగి నుజ్జయ్యారు. ప్రోటోకాల్ మర్యాదలు చూపించాల్సిన అధికారులు పాపం మంత్రిని సమీపించలేక నిరాశతో తిరిగి వచ్చారు.

### సోమిరెడ్డి కోరిక నెరవేరింది

స్టేషన్ వద్ద అలంకరించిన టాపులేని వ్యాన్ ఎక్కిన సోమిరెడ్డి తన మామ స్వర్గీయ శ్రీనివాసులురెడ్డి స్టైల్లో ప్రజలకు అభివాదం చేస్తూ కూర్చొన్నారు. జనాల నుంచి వచ్చిపడుతున్న పూల మాలల దెబ్బకు పలుచోట్ల తుళ్లి పడ్డారాయన. తప్పెట్లు, బ్యాండు మేళాలు, బాణా సంచా మోతలు, కోలాటాలు ముందు సాగుతుండగా ప్రదర్శనగా బయలు దేరిన మంత్రి బోసు, ఎసి సుబ్బారెడ్డి, గాంధీ, అంబేద్కర్ విగ్రహాలకు పూల మాలలు వేశారు. మరో సహ మంత్రి పరసా రత్నం కూడా సోమిరెడ్డి ప్రక్కనే ఆసీనులయ్యారు. రాజకీయ రణధీరుడు, శ్రీనన్న సన్నిధి, రాజయ్య పెన్నిధి, చంద్రమోహనుడికి పరమావధి అంటూ వ్రాసిన బ్యానర్లు పలువుర్ని ఆకర్షించాయి.

ప్రదర్శన రెండు గంటల ప్రాంతంలో మద్రాసు బస్టాండు వద్దకు చేరుకుంది. జిల్లా పార్టీ కార్యదర్శి వేనాటి మునిరెడ్డి అధ్యక్షతన సభ జరిగింది.

కొరవ 11 పేజీలో

# డీలర్ల తప్పులకు జరిమానాతో సరి

కొండంత రాగం తీసి తుమ్మెద పదం పాడినట్లుంది జిల్లా అధికారుల వైఖరి. చౌకధరల దుకాణాల ద్వారా జిల్లాలో పంపిణీ చేయాల్సిన కోట్ల రూపాయల పామోలిన్, కిరోసిన్ చీకటి మార్కెట్‌కు తరలిపోయిన విషయమై స్పష్టమైన ఆధారాలు లభించినా అధికారులు తీసుకొన్న చర్యలు కంటి తుడుపుగా ఉన్నాయి. జాయింట్ కలెక్టర్ నిత్యావసర సరకుల చట్టం క్రింద కేసులు నమోదు చేసి 26,800 జరిమానా విధిస్తూ 20తేది తీర్పు చెప్పారు. స్టోన్‌హౌస్ పేటలో గల వప్పుపలవీధిలో పామోలిన్ దుర్వినియోగం చేశారన్న అంశంపై శేఖర్ ఎంటర్ ప్రైజెస్ యజమానికి 15వేలు జరిమానా; బృందావనంలో మరొక డీలరుకి 2700లు విధించి సరిపెట్టకొన్నారు. విజిలెన్స్ దర్యాప్తు జరిపి గత నెలలో సమర్పించిన నివేదిక గూర్చి వివరాలు ఇచ్చే అధికారి జిల్లాలో కరువయ్యారు.

### నెల్లూరుసంగతులు

# ఆరేళ్లయినా పూర్తికాని అంగన్‌వాడీ భవనం

ఉదయగిరి మండలం బిజ్జంపల్లి గ్రామంలో అంగన్‌వాడీ భవన నిర్మాణం నత్తనడకన సాగుతుంది. అంగన్‌వాడీ ప్రాజెక్టుల్లో భాగంగా ఈ గ్రామంలో భవనం కట్టేందుకు 1987 సంవత్సరంలో నిధులు మంజూరయ్యాయి. అయితే శంకుస్థాపన జరిగినా, కాంట్రాక్టర్ భవనాన్ని గోడలు వరకే కట్టి సరిపెట్టుకొన్నారు. మొండిగోడలతో ఆరేళ్లుగా అంగన్‌వాడీ భవనం ప్రాజెక్ట్ ప్రతిభ చూపిస్తూ చూపరులను ఆకర్షిస్తుంది. అధికారులు ఈ కాంట్రాక్టర్‌కు పని కాకుండానే ఫైనల్ బిల్లు చెల్లించేసారన్న విమర్శలు కూడా వినవస్తున్నాయి. దూరాభారమని తలచక ఎవరో ఒక జిల్లా అధికారి బిజ్జంపల్లికి వెళ్లి అంగన్‌వాడీ భవనాన్ని పరిశీలించి తగిన న్యాయం చేస్తే గ్రామస్తులు సంతోషిస్తారు.

## సంతోషంగానే రాజీనామా చేసా: బల్లి

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు మాట శిరోధార్యంగా భావించి సంతోషంగా, మనస్ఫూర్తిగా రాజీనామా చేసినట్లు మాజీ సెకండరీ విద్యా శాఖా మంత్రి బల్లి దుర్గాప్రసాద్ చెప్పారు. 20తేది గూడూరు వచ్చిన ఆయన విలేఖరులతో మాట్లాడారు. నేను మూడు సార్లు ఎమ్మెల్యే కావడానికి చంద్రబాబు నాయుడే కారణం. ఏవో పరిస్థితుల వల్ల రాజీనామా చేయమన్నారు; చేసానని వివరించా రాయన. తాను మంత్రిగా వుండిన కాలంలో గూడూరుకు చేసిన అభివృద్ధి పనులు వివరించారు. రాజీనామా చేసి సిఎంకు ఇచ్చి నప్పుడు కూడా నియోజక వర్గంలో పొర్లుకట్టల గూర్చి ప్రస్తావన తెచ్చినట్లు చెప్పుక పోయారాయన.

## అందరూ మంత్రులు కాలేరు

జిల్లాలో శాసనసభ్యు లందరికీ మంత్రి పదవులు లభించవని, అప్పటికే జిల్లాలో ఇద్దరికి మంత్రి పదవు లిచ్చి ముఖ్యమంత్రి ఎంతో న్యాయం చేసినట్లు ఉదయగిరి శాసనసభ్యుడు కంభం విజయరామిరెడ్డి చెప్పారు. పార్టీ సంస్థాగత ఎన్నికల నిర్వహణ కోసం కావలి వచ్చిన విజయ రామిరెడ్డి విలేఖరులతో మాట్లాడారు. నియోజక వర్గ అభివృద్ధికి పాటు పడాలన్న ఆసక్తి వుంటే, మంత్రి పదవి అవసరం లేదన్నారాయన. కాని కావలి డివిజన్‌కు మంత్రి వర్గ విస్తరణలో ఎప్పుడూ అన్యాయం జరుగుతుందని కంభం తన మనసులోని మాట వెల్లడించారు. కావలి నియోజక వర్గంగూర్చి ఎమ్మెల్యే యానాదిరెడ్డి పట్టించుకోక పోవడం వల్ల అభివృద్ధిలో వెనుకబడి ఉందన్నారు. తెలుగు దేశం పార్టీ అధికారంలోకి వచ్చాక టౌన్‌లో సిమెంట్ రోడ్ల నిర్మాణానికి శ్రీకారం చుట్టినట్లు పార్టీ రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు వంటేరు వేణుగోపాలరెడ్డి చెప్పారు. విలేఖరుల సమావేశంలో జడ్పీటిసి సభ్యుడు నాయుడు రాంప్రసాద్, శెతిరెడ్డి రామకోటారెడ్డి కూడా పాల్గొన్నారు.

## జర్నలిస్టులకు శిక్షణా తరగతులు

**జిల్లా వార్తలు**

రాష్ట్ర ప్రెస్ అకాడమి, ఎపియుడబ్ల్యూజె నెల్లూరు జిల్లా శాఖ సంయుక్త ఆధ్వర్యంలో జనవరి 7,8,9తేదీల్లో గ్రామీణ విలేఖరులకు శిక్షణా తరగతులు నిర్వహిస్తుంది. నెల్లూరు ఆచారి వీధిలోని నెల్లూరు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో ఇవి జరుగుతాయి. 60మంది విలేఖరులకు ఈ తరగతుల్లో ప్రాథమిక శిక్షణ ఇస్తారు. గ్రామీణ విలేఖరుల్లో నైపుణ్యం పదును పెట్టేందుకు ప్రెస్ అకాడమి - ఈ శిక్షణా కార్యక్రమాన్ని రూపొందించింది. శిక్షణ పొందిన వారికి సర్టిఫికెట్లు కూడా ఇస్తారు. ఆసక్తివున్న జర్నలిస్టులు తమ పత్రికల జిల్లా విలేఖరుల వద్ద పేర్లు నమోదు చేసుకోవాలి. శిక్షణా తరగతులకు హాజరయ్యే వారికి ఉచిత భోజనం, వసతి సమకూరుస్తారు. నెల్లూరు జర్నలిస్టుల యూనియన్ కొత్త కార్యవర్గం బాధ్యతలు స్వీకరించాక చేస్తున్న రెండవ మంచి పని ఇది.

# నెల్లూరులో మెడికల్ కాలేజీ పెట్టిస్తా!

**పరసా వాగ్దానం**

రాష్ట్ర సాంకేతిక విద్యా శాఖా మంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించిన సూళ్లూరుపేట శాసనసభ్యుడు పరసా రత్నం చాలా హుషారుగా కనపడుతున్నారు. అప్పుడే వాగ్దానాల వర్షం కురిపిస్తున్నారు. హైదరాబాద్ నుంచి సూళ్లూరుపేటకు రైలులో వెళుతూ గూడూరు రైల్వే స్టేషన్‌లో విలేఖరులతో కాసేపు మాట్లాడారాయన. జిల్లా ప్రజల చిరకాల కోర్కైన నెల్లూరులో వైద్య కళాశాలను, తనతోటి మంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, శాసనసభ్యుల సహకారంతో 1998 లోగా ఏర్పాటయ్యేలా చూస్తానని పెద్ద వాగ్దానం చేశారాయన. నెల్లూరులో మినీ ఎయిర్ పోర్టుకు కూడా కృషి చేస్తానన్నారు. ముఖ్యమంత్రి తనపై ఉంచిన బాధ్యతను చిత్త శుద్ధితో నిర్వహిస్తానని చెబుతూ; జిల్లాలో ఎవరికి ఏపని పడినా నేరుగా తన వద్దకు వచ్చి కలవచ్చని భరోసా ఇచ్చారాయన. చూడాలి మరి మంత్రిగారి పనితీరును!

## డిపెప్ శిక్షణ

జిల్లాలో ప్రాథమిక విద్యా కార్యక్రమాన్ని ప్రత్యేక తరహాలో చేపడు తున్నారు. దీనికోసం సీతారామ పురం,

కొరవ 7 పేజీలో

# నెల్లూరు జిల్లాలో వి.ఐ.పి.ల కార్యక్రమాలు

## జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు శ్రీ ఎన్. జనార్దన రెడ్డి 24 తేది నెల్లూరు వచ్చారు. జిల్లాలో కాంగ్రెస్ సభ్యులను చేర్పించే కార్యక్రమం పర్యవేక్షిస్తున్నారు. 30 తేది వరకు జిల్లాలోనే వుంటారు.

## సోమిరెడ్డి

సర్వేపల్లి శాసన సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి పేరు కంటె ఆయనకున్న శాఖల పేర్లే పొడుగ్గా వున్నాయి. వాటిలో ప్రాధాన్యత కల్గినదేదో ఒకటుంది. అదిగో అదే తట్టడం లేదు. అందుకోసం షార్ట్ కట్‌లో బహుశాఖల మంత్రి అందామా? అనడం ఎబ్బెట్టుగా వుంటున్నది. మొదటిసారి కాబట్టి – వాటి పేర్లు చెప్పుకుందాం!

సిఎంఎవై, క్రీడలు, యువజన సేవలు, చిన్నతరహా పరిశ్రమలు, ఖాది గ్రామోద్యోగ పరిశ్రమల మంత్రి శ్రీ చంద్రమోహన రెడ్డి 2. తేది ఉదయం పినాకినీలో నెల్లూరు వచ్చారు; 27 తేది (అంటే ఈ రోజు) తిరిగి హైదరాబాదెక్స్ ప్రెస్ ఎక్కి ...

సాంకేతిక మంత్రి ... కార్యక్రమమూ పై దానికి డిటో – రైళ్లు తేడా కూడా లేదు.

## వెంకయ్యానాయుడు

బిజెపి జాతీయ కార్యదర్శి శ్రీ ఎం. వెంకయ్యనాయుడు 23 తేది నెల్లూరు వచ్చారు. తుఫాన్ వరద బాధితులకు సహాయ మందించడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిర్లిప్తతను నిరసించి కలెక్టరేట్ వద్ద పికెటింగ్ చేసి, అరెస్ట్ అయ్యి ఆ తర్వాత మద్రాసు వెళ్లారు.

## రాజేశ్వరమ్మ గుడి ఛైర్మన్ పరారీ?

దర్గామిట్ట శ్రీ రాజరాజేశ్వరి దేవస్థానానికి చెడ మొదలైంది. పన్నెండేళ్లు రాజేశ్వరమ్మను కన్నతల్లి వలె ఆరాధించి, కొంచెం కూడా కష్టం తెలియ కుండా రాఘవ రెడ్డి దేవాలయాన్ని నిర్వహించారు. కొత్త ఛైర్మన్ రాకతో సమస్యలు మొదలై పోయాయి.

మొన్న 20, 21 తేదులలో దేవాలయంకు వచ్చిన చిల్లర డబ్బు, టిక్కెట్ల సొమ్ము తీసుకొని, ఆఫీసు గదికి తాళం పెట్టి, అంతు లేకుండా వెళ్లిపోయాడట కొత్త ఛైర్మన్. గుడికి ప్రభుత్వం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరును నియమించింది. సహజంగా చెక్ పవరూ ఆయనకే ఇచ్చారు. దీనితో ఛైర్మన్‌కు మనసు కష్టం కల్గిందట, ఆ కక్షతో దేవాలయం ముందు వుండిన చెప్పుల స్టాండ్‌ను, కొంచెం దూరంలో వేసి వుండిన కుటీరాన్ని కూలద్రోయించి, ఆఫీసుకు తాళం పెట్టి ఉడాయించేశాయన.

తండ్రికి తగ్గ తనయుడనేది ఇటువంటి వారిని చూచి కాబోలు. పన్నెండేళ్ల క్రితం అతడి తండ్రి – స్వర్గీయ రత్నస్వామి మొదలియార్ ఇదే ప్రకారం అమ్మవారి నగలు, హుండీలోని డబ్బు తీసుకొని మళ్లీ ముఖం చూపించ లేదు. పదవీ ప్రమాణం చేసిన వారం రోజుల లోపల కుమారుడు అదే ఘనకార్యం వెలగ బెట్టారు. "అబ్బను మేలని పించావురా కొడకా!"

ఇటువంటి వారిని దేవస్థానం ఛైర్మన్‌గా నియమించిన మాజీ మంత్రి రమేష్ రెడ్డి పొగడ వేయినోళ్లు చాలునా?

## నాగభూషణమ్మ బెదరింపు

జెప ఛైర్మన్ డాక్టర్ ఎం. నాగభూషణమ్మ కోరి కొరివితో తల గోకుంటున్నారు. తన అవినీతి చర్యలపై దర్యాప్తు జరిపించాలని కలెక్టర్‌ను వినతి పత్రం ఇచ్చిన ఉపాధ్యాయ సంఘాలపై విరుచుక పడుతున్నారామె. వారిమీద పరువు నష్టం దావా వేస్తానని బెదరించారామె.

నాగభూషణమ్మ గారు మీరు ఏ తీగ కదిపినా డొంకంతా కదుల్తుంది. దేముడు మంచి బుద్ధి పుట్టించి పరువు నష్టం దాఖలు చేయించాలే కాని – మీ అవినీతి గుట్టంతా ఎవరి దర్యాప్తు అవసరం లేకుండా న్యాయ స్థానాల విచారణ ... దయచేసి ఆ ... కట్టుకోండి – జీపకు పట్టిన లంచాల కుళ్లు వదిలి పోతుంది.

## రామయ్యంగార్ కాలధర్మం

నాడి చూసి, రోగ నిర్ధారణ చేయగలిగిన అసాధారణ ప్రతిభా వంతుడు, చేయెత్తి దండం పెట్టదగిన

కరవ 7 పేజిలో

# సుప్రీంకోర్టు తీర్పు రొయ్యలకు మరణశాసనం విధించిందా?

రొయ్యల పరిశ్రమపై సుప్రీం కోర్టు తీర్పు ప్రభావంపై పలు రకాలుగా చర్చ జరుగుతూంది. తీర్పుపై సక్రమమైన వివరణ లభ్యం కాకపోవడంతో ఎవరి చిత్తం వచ్చినట్లు వారు వ్యాఖ్యానిస్తున్నారు. ప్రచారం చేస్తున్నారు. సుప్రీం కోర్టు తప్ప మరెవ్వరూ దీనిపై వివరించలేని పరిస్థితి కన్పిస్తోంది. తీర్పులోని కొన్ని ముఖ్య భాగాలు చదవండి!

కోస్టల్ రెగ్యులేటర్ జోన్ పరిధిలో ఎటువంటి రొయ్యల చెరువు లేదా పరిశ్రమ స్థాపించ కూడదు; ఈ నియమం సముద్ర తీరానికే కాకుండా – సిఆర్‌జెడ్ రెగ్యులేషన్‌లో నిర్వచించిన కాలువలు, నదులు, బ్యాక్‌వాటర్స్, సముద్ర ముఖాలకు కూడా వర్తిస్తుంది. సాంప్రదాయ చెరువులకు మాత్రమే దీని నుంచి మినహాయింపు.

ఈ సిఆర్‌జెడ్ నియమాల పరిధిలో వుండే రొయ్యలు, చేపల చెరువులు, వాటి సంబంధించిన పరిశ్రమలు కూడా 1997 మార్చి 31 తేది లోపల ధ్వంసం చేయాలి. జిల్లా కలెక్టర్లు, జిల్లా పోలీస్ సూపరింటెండెంట్లు తమ ప్రాంతాలలోని రొయ్యల చెరువులు ధ్వంసం చేసి 1997 ఏప్రెల్ 15 తేది లోపల కోర్టుకు నివేదిక సమర్పించాలి.

వ్యవసాయ భూములు, ఉప్పు తయారు చేసే కయ్యలు, మడచెట్ల పొలాలు, బురద నేలలు, అటవీ భూములు, గ్రామంలో సంయుక్త ప్రయోజనం కోసం వాడే స్థలాలు, రొయ్యల చెరువులు, పరిశ్రమల కోసం వాడకూడదు. చిలకా, పులికాట్ సరస్సులు, నేలపట్టు పక్షుల రక్షిత కేంద్రం నుంచి ఒక కిలోమీటరు లోపల ఏ చెరువూ నడప కూడదు. ఇప్పటికే అక్కడ చెరువులు వుంటే మార్చి 31 తేది లోపల ధ్వంసం చేయాలి. వీటిని ధ్వంసం చేసే బాధ్యత కలెక్టర్లు, ఎస్‌పిలు స్వీకరించాలి.

సిఆర్‌జెడ్ పరిధికి అవతల వుండే చెరువులు, పరిశ్రమల యజమానులు కూడా ఏప్రెల్ 30 తేది లోపల కోర్టు నియమించే సంస్థ నుంచి అనుమతి తెచ్చుకోవాలి. ఇప్పుడు నడుస్తున్న చెరువులకు ఈ నియమం వర్తిస్తుంది. సిఆర్‌జెడ్ పరిధికి దూరంగా వున్నప్పటికీ – ఆయా చెరువులు సెమీ ఇంటెన్సివ్ వంటి పద్ధతుల ద్వారా కాలుష్యం పెంచి, అధిక ప్రొటీన్లు కల్గిన మేతలు వాడి పరిసరాలలోని కాలువలో, సరస్సులలో పాచి తదితరాలకు హాని కల్గించే వైనా లేదా బావులలో మంచినీటి వసతి చెడిపేవైనా, భూగర్భంలో ఉప్పునీరు పెంచేవైనా, మట్టిలో ఉప్పు శాతం పెంచేవైనా – తక్షణం మూసి వేయాలి. ఆ చెరువులను అనుమతించ రాదు.

ఈ తీర్పు వల్ల మూతపడే కంపెనీల ఉద్యోగులను రిట్రెంచ్ చేయరాదు. వారికి ఆరు సంవత్సరాల జీతం నష్ట పరిహారంగా చెల్లించాలి; లేదా రొయ్యల చెరువుల వల్ల ప్రక్క నుండే వారికి కాని, లేదా పరిసరాలకు కాని ఏ రూపంలో నష్టం జరిగి వుండినా – అందుకు తగిన ప్రతిఫలం చెరువుల యజమానుల నుంచి కలెక్టర్లు వసూలు చేయాలి.

ఈ నియమాలన్నీ అమలు పరిచేటందుకు కేంద్ర ప్రభుత్వం 1997 జనవరి 15 లోపల ఒక కమిటీ నియమించి, దానికి అన్ని అధికారాలూ కట్టబెట్టాలి. ఈ తీర్పులోని ఏ భాగం అతిక్రమించినా అది కోర్టుధిక్కార నేరం క్రిందకు వస్తుంది."

ఇదీ స్థూలంగా సుప్రీం కోర్టు తీర్పు పాఠం. తీర్పు చాలా తీవ్రంగా వుంది. రొయ్యల పరిశ్రమల వల్ల పర్యావరణం కాలుష్యం జరుగు తుందన్న స్థిరాభిప్రాయానికి వచ్చినట్లున్నారు న్యాయ మూర్తులు.

అందువల్లే రివిజన్ పిటీషన్ దాఖలు చేయడానికి ప్రయత్నాలు జరుగు తున్నాయి.

జనవరి 15 తేది అందుకు ముహూర్తంగా నిర్ణయించారు. లేనిపక్షంలో మార్చి 31 తేది లోపల కలెక్టర్లు తమ బాధ్యత నెరవేర్చ వలసి వుంటుంది. దీనిపై రాష్ట్ర ప్రభుత్వం చేయగల్గింది ఏదీ లేదు. సుప్రీం కోర్టు రాష్ట్ర ప్రభుత్వం ప్రస్తావన చేయకుండా నేరుగా కలెక్టర్లు, ఎస్‌పిలను ఆదేశం ఇచ్చింది. అందువల్ల వారు ప్రభుత్వ ఉత్తర్వుల కోసం ఎదురు చూసినా – తీర్పు అమలు పరచక పోయిన వారిపై చర్య చాలా తీక్షణంగా వుంటుంది.

రొయ్యల పరిశ్రమకిది చాలా సంక్లిష్టమైన పరిస్థితి. దీని నుంచి బయట పడాలంటే – సుప్రీం కోర్టు డివిజన్ తీర్పు అనుకూలంగా రావలసిందే; వేరే మార్గం లేదు; ఎవరూ చేయగలిగింది ఏమీ లేదు. తీర్పు పూర్తి వివరాలు పైవారం ప్రచురిస్తాము.

– దోలేంద్ర

## సణుగుడు

4 పేజీ తరువాయి

బాగా పంట పట్టించుకున్న వారు. అందువల్లే పదవిలో వున్నా, లేకున్నా వివాదాలు సృష్టించుకోని క్రమశిక్షణలో వుంటుంటారు. స్నేహితుల కంటే, శత్రువుల సంఖ్య జాస్తి. మంత్రి పదవి విషయంలోనూ ఇదే వ్యక్తమైంది. జిల్లా తెలుగు దేశం అధ్యక్షుడు శ్రీ వేనాటి మునిరెడ్డి, జిల్లా పరిషత్ ఛైర్మన్ డాక్టర్ నాగభూషణమ్మ, ఒకరిద్దరు ఎమ్మెల్యేలు పదిగట్టుకొని వెళ్లి చంద్రమోహన్ రెడ్డికి మంత్రిత్వం ఇవ్వవద్దని చంద్రబాబుకు చెప్పి వచ్చారు. 1995లో ఎన్‌టిఆర్‌కూ ఇదే చెప్పారు - అనాటి జెడ్‌పి ఛైర్మన్ తేగా తదితరులు. ఎన్‌టిఆర్ ఆ మాట విన్నారు కాని, చంద్రబాబు విన్పించుకోలేదు. పదవి ఇచ్చి, నీమీద ఎమ్మెల్యేల నుంచి ఫిర్యాదు లున్నాయి, జాగ్రత్తగా మసలుకో అని మాత్రం హెచ్చరించారట.

చంద్రమోహన్ రెడ్డి రాజకీయ జీవితంలో ఇది వైభవోపేతమైన పదవీ ప్రాప్తం! అంత చిన్న వయస్సులో (40 సంవత్సరాలు) అతి పెద్ద క్యాబినెట్ మంత్రిత్వం పొందడం అదృష్టమే. దీన్ని సాధించడానికి చాలా కష్టపడిన మాట నిజం. నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారితో కలిసి రాజకీయ ఎత్తుపల్లాలలో పయనించడం; తెలుగు దేశం అధికారంలో లేని రోజుల్లోనూ కలికి బలపం కట్టుకొని, పార్టీ బరువు భుజాన వేసుకొని జిల్లా అంతా తిరిగారు. సారా వ్యతిరేకోద్యమంలో కీలక పాత్ర వహించారు. ఇవన్నీ ఒక ఎత్తు - ఇప్పటి మంత్రి పదవి నిర్వహణ ఒక ఎత్తు. దానిని సంపాదించడానికి పడిన కష్టానికి పది రెట్లు కష్టపడనిదే అది నిలవదు; వుండి వుపయోగ పడదు.

నెల్లూరు జిల్లాలో మంత్రిగా చలామణి కావడం చాలా కష్టం. ఎసి సుబ్బారెడ్డి వంటి మేరునగధీరుడ్ని; నేదురుమల్లి జనార్ధనరెడ్డి వంటి సమర్థుడ్ని; నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి వంటి రాజకీయ మేధావిని చూచిన జిల్లా ఇది. మంత్రులంటే ఎట్లా వుండాలో, ఎట్లా వుండవచ్చో, ఎట్లా వుపయోగ పెట్టుకోవచ్చో, ఎంతటి అధికారం చలాయించ వచ్చో, ఎంతటి దర్పం ప్రదర్శించ వచ్చో, ఎంతటి బలం పెంచుకోవచ్చో చూపించేశారు వారు ముగ్గురూ! ఆ తర్వాత వచ్చిన వారందరూ వారితో పోలికకు నిలువలేక తుస్సుమన్నారు. కాంగ్రెస్ మంత్రులూ అంతే; తెలుగు దేశం వారిదీ అదే తంతే! ఇప్పుడు చంద్రమోహన్ రెడ్డి ఆ పరీక్షకు నిలబడ్డారు. ఇందులో నెగ్గుక రావడం అంత సులభం కాదు.

తెలుగు దేశం ప్రభుత్వంలో మంత్రులకు సహజంగానే పెద్దగా విలువ వుండదు. పాత రోజుల్లో మంత్రి అంటే జిల్లా నాయకుడని అర్థం. ఎమ్మెల్యే లందరూ మంత్రిని అనుసరించి వెళ్లేవారు. జిల్లాకు సంబంధించిన ఏ పనైనా మంత్రి మాట ముఖ్యమంత్రి వద్ద చెల్లుబాటయ్యేది. ఇప్పుడా పరిస్థితి లేదు. ఎమ్మెల్యేల ననుసరించి మంత్రులు నడవాలి. కనీసం ఇతర ఎమ్మెల్యేల నియోజకవర్గాలలో వారి అనుమతి లేకుండా ఒక చిన్న కార్యక్రమానికి వెళ్లే స్వతంత్రం కూడా లేదు. అవి జరిపితేనా, పోట్లాటలైనా ఎమ్మెల్యే వద్దంటే అంతే! ఎమ్మెల్యేలు వీలుగా తన వద్దకు వస్తేనే ముఖ్యమంత్రి పనిపాటు చేసేది. మంత్రుల సిఫార్సు అవసరం లేదు. జిల్లాకు సంబంధించినంత వరకూ ఎమ్మెల్యేలకు మంత్రికి పెద్ద తేడా లేదు. మంత్రి ప్రభుత్వ కారులో లైట్ వెలిగించుకొని తిరుగుతారు - అంతే తేడా! అన్ని కట్టుబాట్ల మధ్య మంత్రిగా రాణింపుకు రావాలంటే కష్టమే! అందులోనూ చంద్రమోహన్ రెడ్డిని చూస్తే - అదొకరకం జంకు - మెత దూర్చే సందిస్తే గుడారమంతా ఆక్రమించేస్తారని! పూర్వం వెంకటగిరి రాజాలు ఇంటి ముందుకు వస్తే - సాధారణ ప్రజలు వారికి వాకిట్లోనే హారతి పట్టి, గౌరవించి, పంపేవారట; రాజుల పాదం ఇంట్లో పడితే - అరిష్టమని భయం. చంద్రమోహన్ రెడ్డి విషయంలో ఎమ్మెల్యేలు ఇదే సాంప్రదాయం అనుసరించ బోతారు.

రమేష్‌రెడ్డి, దుర్గా ప్రసాద్‌లు పదిహేను నెలలు మంత్రులుగా వుండినా - కాంగ్రెస్ వారులు పట్టించు కోలేదు. చంద్రమోహన్ రెడ్డిని అంత తేలికగా వదిలి పెట్టరు; ప్రతి కదలికా వేయి కళ్ళతో గమనిస్తారు; మొక్కగా వుండగానే వంగదీయ జూస్తారు; మానయ్యే అవకాశం ఇవ్వరు.

ఇటు స్వంత పార్టీలో, అటు ప్రతిపక్ష పార్టీలో సహకారం లేనప్పుడు ఏ మంత్రి అయినా చేయగల్గింది, ఎదగ గల్గింది ఏదీ లేదు. కాని మంత్రి పదవి రాగానే చుట్టూ చేరే వారు - మంత్రులకు తమ నిజ పరిస్థితి తెలుసుకొనే అవకాశం ఇవ్వరు. పనుల కోసం, పైరవీల కోసం భజన చేసే తత్వం కల్గిన వారు మట్టుబదరి కొట్టేస్తారు; కళ్ళకు పొరలు క్రమ్మేటట్లు కైపు కల్గిస్తారు. ఆ మత్తు నుంచి తెరిపిన పడేలోగా జరగ వలసిన అనర్థం జరిగి పోతుంది.

మంత్రిగా మొదటిసారి వచ్చిన సందర్భంలో చంద్రమోహన్ రెడ్డికి జరిగిన స్వాగత సత్కారం ఈ తీరులోనిదే! అది తన ఘనత, తన అభిమానుల ఆదరం, తనకు పట్టిన అదృష్టం అని చంద్రమోహన్ రెడ్డి భావిస్తే - పప్పులో కాలి పాదం పడినట్లే లెక్క. అది మంత్రిత్వానికి జరిగిన సత్కారమే తప్ప - దాని వెనుక వుండే మనిషికి ఇచ్చిన ఆదరణ కాదు. నిన్నటి వరకు వంటరిగా రైలుదిగి కారెక్కి వెళ్తుంటే పట్టించుకోని "జనం" నేడెందుకు రైల్వేస్టేషన్ దద్దరిల్లే నినాదాలు చేసినట్లు? మంత్రులుగా ఎదిగే ప్రతి ఒక్కరూ ఈ వాస్తవం విస్మరిస్తారు!

మంత్రి పదవులు అనేవి అవెప్పుడు వస్తాయో, ఎప్పుడు పూడుతాయో ఎవరు చెప్పలేరు. కాని చేసే మంచి పనులు శాశ్వతం. మనిషి గతించినా అవి మరపురావు. ఎసి సుబ్బారెడ్డి గారు మరణించి ముప్పయ్యేళ్ళయింది. కాని ఈనాటికి ఆయన్ను స్మరించు కొంటున్నాం! ఆయన వారసులుగా ఆ పదవుల్లోకి వచ్చిన వారు ఇంకా మన ముందు తిరుగుతూనే వున్నారు. కాని వారిని గుర్తిస్తున్నామా? గౌరవిస్తున్నామా? ఈ తేడా తెలుసుకోగల్గితే చంద్రమోహన్ రెడ్డి వంటి కొత్త తరం రాజకీయ వాదులు పది కాలాల పాటు జనంలో నిలుస్తారు; లేకుంటే అభినందన పూలమాల వాడినంత సేపు కూడా గుర్తుండరు; తెరమరుగై పోతారు.

## ఎన్టీఆర్

మొదటి పేజీ తరువాయి

ఎత్తుగడలో భాగం. హరికృష్ణ తనను ముఖ్య మంత్రిగా గౌరవించడం లేదని ఆయనకు మొదటి నుంచి కినుక. హరికి మంత్రి పదవి ఇచ్చినా, ఇవ్వక పోయినా సమస్యలు తప్పవు కాబట్టి; మంత్రి వర్గంలోకి పిల్చి ఇంట్లో న్యూసెన్స్ సృష్టించుకొనే కంటే - దూరంగా పెట్టి గౌరవ బయటపడడం మంచిదనే వుద్దేశ్యంతోనే ఈ నిర్ణయం తీసుకున్నట్లు చెప్తున్నారు చంద్రబాబు. ఈ విషయంలో ఏ సవాలైనా రెడీ అంటున్నారు.

ఎన్‌టిఆర్ కుటుంబ సభ్యులు మాత్రం దీన్నంత తేలికగా తీసుకోవడం లేదు. పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వర రావు, పెద్ద కుమారుడు హరికృష్ణ లిరువురికీ ఒకే తీరులో పరాభవం జరగడాన్ని వారు జీర్ణించుకోలేక పోతున్నారు. వారిలో చంద్రబాబుపై కక్ష, కోపం కట్టలు త్రెంచు కొంటున్నాయి. కాని సమైక్యంగా, సమర్థ వంతంగా చంద్ర బాబును ప్రతిఘటించ గల శక్తి, సామర్థ్యాలు వారిలో లేవు. హరికృష్ణలో ఆవేశం తప్ప, ఆలోచన లేదు. అందువల్ల బాలకృష్ణను ప్రత్యక్షంగా రంగంలోకి దింప డానికి కుటుంబ సభ్యు లందరూ కలసి కృషి చేస్తున్నారు. బాలకృష్ణను ముందు నిలిపి, హరికృష్ణను సేనాధిపతిగా పెట్టి చంద్ర బాబుపై సమరం సాగించాలన్నది వీరి సంకల్పం. వీలైతే తెలుగుదేశం పార్టీని చీల్చి, తగినంత మంది ఎమ్మెల్యేలను సమీకరించి ప్రభుత్వాన్ని పడగొట్టడం; లేని పక్షంలో కొత్త పార్టీ నెలకొల్పి వచ్చే ఎన్నికల నాటికి చంద్ర బాబును రాజకీయంగా ప్రతిఘటించడం వీరి మదిలో మెదల్తున్న ఆలోచనలు. ఏదైనా ఒక పథకం ప్రకారం, ప్రణాళిక రచించుకొని, సర్వహంగులూ సమకూర్చుకొని, ఆ తర్వాత ప్రతిఘటన ప్రారంభించా లన్నది హరికృష్ణాదుల యోచన.

మద్య నిషేధం రద్దు ప్రతిపాదన వీరికి పాశుపతాస్త్రం వలె వుపకరించ బోతుంది. రాజకీయంగా ఎన్‌టిఆర్ కుటుంబాన్ని వంచించిన తీరులోనే, పరిపాలనా పరంగా ఎన్‌టిఆర్ ప్రవేశ పెట్టిన ప్రజా ప్రయోజన పథకాలనూ చంద్ర బాబు నిర్వీర్యం చేస్తున్నారన్న నినాదంతో ప్రజల ముందుకు వెళ్లాలని హరికృష్ణ ఉబలాట పడుతున్నారు. మద్యపాన నిషేధం రద్దు - ముఖ్య మంత్రికి పెద్ద సంకటంగా వుంది. దాన్ని రద్దు చేయాలనే ఒత్తిడి పార్టీలోని సహచరుల నుంచి, ప్రభుత్వం లోని అధికారుల నుంచి కూడా వస్తున్నది. ఆర్థిక సమస్యలకు అదొక్కటే తరుణోపాయ మన్నది వారి వాదన. కనీసం రెండు వేల కోట్ల రాబడి ఖాయమని అధికారులు ఆయన్ను పూరిస్తున్నారు. కాని, దీనిపై ప్రజలలో చెలరేగే అసంతృప్తి, ఆగ్రహం ఎట్లా వుంటాయోనన్న భయం చంద్ర బాబును పీకుతున్నది.

అందువల్లే చాలా తెలివిగా, ఒక క్రమం ప్రకారం ఈ విషయంలో ప్రజలు మానసికంగా సన్నద్ధు లయ్యేందుకు ప్రచార కార్యక్రమం ప్రారంభించా రాయన. గతంలో మద్య నిషేధం కోసం ఉధృతంగా ఉద్యమం నడిపిన సిపిఎం పార్టీని లొంగ దీసుకున్నారు. సిపిఎం నాయకులను, కార్యకర్తలను రాష్ట్రమంతటా దేవాలయాలు, సహకార సంస్థలు, మార్కెటింగ్ కమిటీలు, ఇతర ప్రభుత్వ పదవులలో నియమిస్తానని ఆశ చూపింది. మద్య నిషేధం రద్దు చేసినా రగడ సృష్టించవద్దనే హామీని సిపిఎం నేతల నుంచి పొందా రాయన. రాష్ట్ర స్థాయి కామ్రేడ్లను కార్పొరేషన్ ఛైర్మన్లుగా నియమిస్తానని చెప్పారట. ఈ తాయిలానికి ఆశపడిన ఎర్రచొక్కాల దళం మద్య నిషేధం రద్దును వివాదా స్పదం చేయక పోవడమే కాదు - పరోక్షంగా సమర్థిస్తున్నది. కమ్యూనిస్టులు సైగ్గా వుండిపోతే దీనిపై ఎదురు మరురు నిరసనలు తప్ప వ్యవస్థీకృత ప్రతిఘటన వుండదన్నది చంద్ర బాబు వుద్దేశ్యం. కాంగ్రెస్ నాయకులలో అధిక సంఖ్యాకులు త్రాగుడు అలవాటు వున్నవారే కాబట్టి, వారి వ్యసనాలను ఎత్తి చూపి, వారు ఉద్యమం నడప కుండా నైతికంగా దెబ్బ తీయవచ్చునని భావిస్తున్నారు.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

అరుదైన వ్యక్తిత్వం గల్గినవాడు శ్రీ రామయ్య కాలధర్మం చెందారు. పాతికేళ్ల క్రితం వరకు - రామయ్యంగార్ మందు తినని నెల్లూరీయుడు లేడనడం అతిశయోక్తి కాదు. ఆయుర్వేదంలో ఆయనది తిరుగులేని వైద్యం. నయాపైస ఆశించకుండా, యాచించకుండా ఎన్ని వందల మంది వచ్చినా వైద్యం చేసి పంపడం ఆయన విశిష్టత. రామయ్యంగార్ చేయి తగలగానే ఎంత పెద్ద రోగమైనా పిల్లిలా పారిపోయేది. పసిరికలకు ఆయనిచ్చే మందు - దివ్యౌషధమే! తానే దగ్గరుండి, మందులు నూరించి తయారు చేసేవారు. ఆయన ముఖంలో దివ్యతేజస్సు కన్పడేది. అల్లోపతి వైద్యం ప్రాచుర్యం పొందిన తర్వాత, మందులు నూరే కూలీలు దొరకక పోవడం వల్ల వైద్యం మానేసి, పంటి మీద చొక్కా కూడా లేకుండా భగవద్ధ్యానంతో ఈ పాతికేళ్లు మద్రాసులోని తన కుమారుడి ఇంట ప్రశాంతంగా గడిపేశారు; అంతే మనశ్శాంతితో భగవ సాన్నిధ్యానం చేరారు. ఆయన్ను ఎరిగిన వారు, ఆయన రూపం, వైద్యం, తేజస్సు జీవితాంతం మరువలేరు. మనుషులలో ఇటువంటి వారు అరుదుగా తారస పడుతుంటారు. ఆయనకు మా శ్రద్ధాంజలి.

## నేటి భారతం

2 వ పేజీ తరువాయి

బిల్లును రాజ్యసభ తిప్పికొట్టింది అయినా సరే, ఆర్డినెన్స్ తీసుకొచ్చి రైతుల్ని ఆదుకొంటానని దేవగౌడ ప్రతిజ్ఞ చేశారు! సెబాష్!

*అదిరేటి డ్రెస్సు మేమేస్తే....*

ప్రపంచ సుందరి పోటీలు రేపిన దుమ్ము దుమారం సద్దుమణగక ముందే - ప్రపంచ సుందరాంగుడి పోటీల నిర్వహణకు ఇండియా రెడీ అవుతున్నది. గ్రేవీరా సూటింగ్స్ కంపెనీ వాళ్లు మిస్టర్ వరల్డ్ పోటీల నిర్వహణ హక్కుల్ని ఒక విదేశీ కంపెనీ నుంచి కొనుగోలు చేశారు. 1997 మార్చిలో ఈ పోటీలు కలకత్తాలో జరుగుతాయి. మిస్టర్ వరల్డ్‌తో బాటు బెస్ట్ మేల్ మోడల్ పోటీని కూడా నిర్వహిస్తారు. అమ్మాయిల అందాల పోటీలపై ఆగం చేసినట్లే ఈ అబ్బాయిల అదిరేటి డ్రెస్సులపై కూడా దరదర లాడిస్తారేమో మన పుణ్యాత్ములూ, పతివ్రతలూ!

## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

చేజర్ల, అనంతసాగరం, బిపి. గూడూరు, అల్లూరు, చిట్టమూరు, దొరవారి సత్రం, దక్కిలి మండలాలను ఎన్నుకొన్నారు. ఈ 8 మండలాల్లోని 25 ప్రాథమిక పాఠశాలలకు నూతన గదులు, మరో 10పాఠశాలలో అదనపు గదులు తక్కువ ఖర్చుతో నూతన సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మిస్తారు. వీటి కోసం ఈ నెల 17తేది నుండి 20తేది వరకు పై మండలాల్లోని విలేజి ఎడ్యుకేషన్ కమిటీ మెంబర్లు, మేషన్లకు నిర్మిత కేంద్రంలో శిక్షణ ఇవ్వబడింది. డిపెప్ ప్రాజెక్ట్ కో ఆర్డినేటర్ పి.ఆంజనేయులు నిర్మిత కేంద్ర డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ జి. సూరరాజు, ప్రాజెక్ట్ ఇంజనీర్ వి. నారాయణరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## అంకెలు ఘనం

రెండవ పేజీ తరువాయి

ఈ ప్రణాళికలో బాధ కల్గించే విషయం - కులాల వారీగా ప్రాధాన్యతలు ప్రస్తావించడం. "ఇతర వెనుక బడిన కులాల వారిని ప్రత్యేకంగా గుర్తించి, సహాయం చేసి, వారి అభివృద్ధికి ప్రణాళిక ద్వారా విశేష కృషి జరుపుతామని పేర్కొన్నారు. ప్రణాళికలలో కుల ప్రస్తావనలు సమంజసం కాదు. కేవలం రాజకీయ స్వార్థంతో చేసిన పని ఇది. పూర్వ ప్రణాళికలలో కులం సంగతి ఎత్తకుండా - బలహీన వర్గాల వారు అని మాత్రమే పేర్కొనేవారు. దేశ అభివృద్ధి కులాల పరంగా జరగాలా?

1996 నాటికి దేశ జనాభాలో 37 శాతం మంది దారిద్ర్య రేఖకు దిగువన వున్నారని ప్రకటించారు. రాష్ట్రాల పరిస్థితులను బట్టి ఈ సంఖ్య మారినా - సగటు సంఖ్య ఇది. అన్ని ప్రణాళికల తర్వాత కూడా ఇందరు భారతీయులు దారిద్ర్యంలో వుండడం దురదృష్టకరం.

## సిమెంటు

రెండవ పేజీ తరువాయి

హఠాత్తుగా ఈ మార్పు వల్ల హెచ్‌డిపిఇ ప్యాకేజింగ్ పరిశ్రమ చాలా నష్టపోతుంది. జనపనార సంచులకు అధిక ధర చెల్లించడం; సిమెంట్ కారిపోయి, నేలపాలు కావడం, గడ్డ కట్టి పోవడం వంటి కారణాల వల్ల సిమెంట్ పరిశ్రమలకు కనీసం 3 వేల కోట్ల రూపాయల నష్టం వస్తుందని అంచనా. ఇది వారికి కోలుకోలేని దెబ్బ. ఒక పరిశ్రమను కాపాడడం కోసం ఇంకొక పరిశ్రమను దెబ్బ తీయడం అన్యాయం.

# రాయి—తురాయి

** పొద్దు చంపుకోవడానికి*
*బుద్ధి మందగించడానికే రంగుల టీవి*

మనం తెలివిలేని వాళ్ళమా? తెలివి మీరిన వాళ్ళమా? కాకుంటే, వినోదం ఇంతగా వెర్రితలలు వేస్తుందా? గ్రీకు పురాణాల్లోని 'హైడ్రానర్పంలా' "వెయ్యి" తలల దండుతో చుట్టుముట్టి మనల్ని మట్టి గరిపిస్తుందా? మంచి చెడ్డలకు మనిషూని – జెల్లెళ్ళ, పల్లెళ్ళను పల్లెలు మొల్లలుగా భ్రమింపజేసి మురిపించి, మైమరి పించేస్తుందా?

మనిషి ఇంద్రియాలకు తృప్తి నిచ్చే విషయ వాలానే సమకూర్చు కొన్నారు; విసిగి వేసారిన మనస్సుకు ఉల్లాసాన్నిచ్చే వస్తు సముదాయాన్ని చేజిక్కించు కొన్నారు – ఆట, పాట, వేట వంటి వినోద ప్రక్రియలు ఎన్నో ఉన్నా; ఇంకా ఏదో కొరత – ఏదో వెలితి;

## అగ్నిమిత్ర

సాహిత్య సౌరభాన్ని వెదజిమ్మే కవితను చదివినప్పుడు గాని, స్వరమధురిమ లొలికే గీతాన్నిగాని, కంటికి ఇంపైన చిత్రాన్నీ, శిల్పాన్నీ, విన్నప్పుడు, కన్నప్పుడు గాని మన హృదయం స్పందించి తదనుగుణమైన అనుభూతులను పొందుతుంది; బుద్ధి వికసిస్తుంది. వికసించిన బుద్ధి మనిషిని ఉత్తమ సంస్కారిగా తీర్చిదిద్ది మనీషిగా మార్చేస్తుంది.

ఇట్లా మనకు అనుభూయమానమైన "రసానందం" ఒకపట్టాన మనల్ని వదిలిపెట్టదు. జీవితాంతం మన మనః కుహరంలో కొలువు దీరి ఉంటుంది. సమయ సందర్భాలు పొసగినప్పుడు మన తలపోతల్లో అది తటాలున తళుక్కు మంటుంది; మళ్లి మొదట మనం అనుభవించిన ఆనందాను భూతినే – పీసమైనా వాసిలో తేడా లేకుండా– గుబాళింప జేస్తుంది.

పూర్వం ఆంధ్ర దేశంలో ప్రతి ఇంటా భారతం ఉండేదట – పొద్దు పుచ్చుకోవడానికి – బుద్ధి పదునెక్క డానికి. ఇప్పుడు ఇంటింటా టీవీ; రంగురంగుల టీవి -పొద్దు చంపుకోడానికి – బుద్ధి మందగించ డానికి. శాస్త్ర సాంకేతిక రంగాలలో వస్తున్న అనేక మార్పుల ఫలితంగా వస్తూత్పత్తిని తమ గుప్పెట్లో చిక్కించుకొని కొన్ని శక్తులు ప్రజల్ని కీలు బొమ్మలుగా చేసి తమ చిత్తం వచ్చినట్లు ఆడిస్తున్నాయి. తాలూ తరకా తరిచి చూసే తెలివిడిని లేకుండా చేస్తున్నాయి. మేలు కీళ్ల విచక్షణ ఉడి నెత్తింది. ఫలితంగా టీవి ఛానల్స్‌లో "కౌంట్‌డౌన్లు" "మనసున మనసై"లు "టాప్‌టెన్లు" సినిమా క్విజ్లు వగైరా వగైరాలు.

దీని విషయమై నాకంటె కవి "ఆశారాజు" ఇంకా మదికెక్కేటట్లు చెప్పగలరు. 16.12.96 ఆంధ్రజ్యోతి దిన పత్రికలో వచ్చిన ఆయన కవిత "ఇంటింటా ఉరితాడు"ను చూద్దాం. వ్యాఖ్యాన నిరపేక్షమైన కవిత ఇది. ఐనా, పాఠక బాహుళ్య సౌలభ్యం కోసం అవసరమని పించిన చోట వివరణ ఇస్తాను.

"ఇలా ఉంటుందను కోలేదు ఉరితాడు
ఇంత అందంగా ఉంటుందను కోలేదు
ఒకర్నుంచి ఒకర్ని వేరుచేసి
ఇంటినిలా స్మశానం చేస్తుందనుకోలేదు
అందరం ఒకే ఇంట్లోనే ఉంటాం
పక్క పక్కనే కూర్చునున్నా
ఒకరితో ఒకరం మాట్లాడు కోలేం
ఇల్లంతా పరుచు కుంటున్న రంగుల్లో
ఊపిరాడక మునకలేస్తుంటాం
ఇలా ఉంటుందను కోలేదు ఉరితాడు
ఇన్ని రంగుల్లో ఉంటుందను కోలేదు
ఉరితాడు;
ఆలోచింప నివ్వదు
చూపుని పక్కకి వాలనివ్వదు
కళ్లనిండా ముసురుకొనే భ్రమలు
అడుగడుగునా వెలసే మయసభలు"

కవిగా ఆశారాజు మేలిమి పనితనం ఈ పద్యంలో చూడవచ్చు. ఉసురు తీసే ఉరితాడును "అందం"గా ఉందనటం; "మయసభలు" చూపించటం ఆయన వక్రోక్తి వాల్లభ్యానికి అద్దంపడు తున్నాయి. ఆప్యాయతలూ, అనురాగాలతో అలరారు తుండవలసిన ఇంటిని కృత్రిమ నీరవ నిశ్శబ్దం ఆవరించింది. మరి అప్పుడది స్మశానం కాదా మరి?

ప్రతి మనిషిలోను – చేస్తున్నపని ఏదైనా సరే – సృజనాత్మక శక్తి ఒకటి ఉంటుందనేది నిర్వివాదమైన నిజం. మనం నిత్యం టివిలో చూసే ప్రోగ్రాంలు సృజనాత్మకతను తుదముట్టా రూపు మాపేస్తున్నాయన్న సంగతి ఎందరు తెలుసు కొంటున్నారు? చూపు పక్కకు మళ్లించనివ్వని కుహనా ఏకాగ్రతలో ఆకాశం దాకా సాగే కుశాగ్రబుద్ధి, వాడి వేడి, ఒడుపు దప్పి ఒడ్డిగిలబడిపొయ్యే ప్రమాదాన్ని ముక్తసరి మాటల్లో ఎంత బాగా చెప్పాడు! ఇంకా వినండి విన్దోయికి విందైన మాటల్ని, కనండి కన్దోయికి ఇంపుగొలుపే శబ్ద చిత్రాల్ని –

"పిల్లలు కలలు కనటం మరిచి
పొయ్యారు
స్వంతంగా నవ్వటం మానేశారు.
గొంతుకి, సూపర్ హిట్ ముఖాబిలాలు,
టాప్ టెన్నులూ, తరానాలు
బిగుసుకొని
దినమంతా గిలగిల కొట్టుకుంటున్నారు.
"ఇల్లు పిచ్చి వాళ్లు తిరిగే
ఎడారయ్యింది.
అందరం దృశ్యాన్ని చూస్తూ
మసక వెల్తురులో ఉరితీయబడు
తుంటాం
ఇలా జరుగు తుందను కోలేదు.
ఉరితాడు మా ఇంట్లోనే వేళ్లాడు
తుందను కోలేదు."

ఇదండీ కవిత్వం; చక్కని సంవిధాన చాతుర్యం: చిక్కనైన భావ సంపద – వచనం బాగుండాలే కాని వచనమైతే ఏం? కర్పూర కళికలా తాను కరుగుతూ, పఠితల్ని కరిగించి, కళ్లు తెరిపించేది ఏదైనా – పద్యమైనా, వచనమైనా సరే – అదే అసలు సిసలైన కవిత్వం. కవి అన్నట్లు ఈ "ఉరితాడు" ఎవరో మనకు తగిలించింది కాదు; మనకు మనమే ఏరి, కోరి ఏర్పాటు చేసుకొన్నది. ఇట్లా మన మెడలకు మనమే తగిలించు కొన్న కంఠ పాశాన్ని తప్పించే దెవ్వరు?

సాంస్కృతిక రంగంలో పెను విప్లవం రావాలి. కాని దిగంతాల వరకూ దృక్కులు సారించినా, దాని చిరుకదలికైనా కంటికి తగలడం లేదు. అభివృద్ధి రాశికి సంబంధించింది; కాగా, అభ్యుదయం వాసికి సూచిక. పెట్టుబడులూ, గిట్టుబడుల పద్దులను పెంచుకొంటూ పొయ్యేది మార్కెట్ ఏకానమి. దీన్లో మానవీయమైన ప్రేమాభిమానాలతో సహా, అన్నీ అంగడి దినుసులే. అన్ని విలువలూ రూపాయకు లోకువే.

ఇటువంటి వ్యవస్థలో సాంస్కృతిక విప్లవం ఆకాశ పుష్పమే. అయితే మనకు గతి మోక్షం లేదా? ఎందుకు లేదు? ఉంది – చంటి పాప తన బొటన వేలును నోట్లో వేసుకొని చీకుతూ తనవేలునే తల్లి రొమ్మును కొంటుంది; తన ఎంగిలినే తాను చప్పరించి మింగుతూ దాన్నే తల్లి పాలనుకొనే భ్రాంతికి లోనవు తుంది. ఆలోచించ లేనంత కాలం మనమూ అంతే!

## పంచాంగమ్

* నూతన సంవత్సరాది

తేది 1 బుధవారం నూతన ఇంగ్లీషు సంవత్సర ప్రారంభము.

**డిసెంబరు తిథులు**

**మార్గశిర బహుళ**

తే 28 శని చతుర్థి పూర్తిగ
తే 29 ఆది చతుర్థి ఉ.గ 8.10వ
తే 30 సోమ పంచమి ఉ.గ. 10.20 వ
తే 31 మంగళ షష్ఠి ఉ.గ. 12.21 వ

**జనవరి తిథులు**

తే 1 బుధ సప్తమి ప.గ. 2.03 వ
తే 2 గురు అష్టమి ప.గ. 3.22 వ
తే 3 శుక్ర నవమి ప.గ. 4.12 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.,

## మాటలతో ఆట – 34 సమాధానాలు

అడ్డం: 1.సమరం 3.కవచం 5.పహారా 8.పరిగ 9.జావళి 10.కారంబది 11.తగ 12.ఆసనం 13.చిత 14.కేతకి 16.రాడు 19.పాదవం 20.మాజీ 22.ఉరుపము 24.కావరం 26.గారవం 27.దానం 28.ఆహా 29.ముసగ 31. ముని 33.మహతి 34.కరణి 36.గద 37.నానా 39.తగు 40.కతవ 42.కంచి 43.మూడు 44.తపతి 45.సిరం 47.వసుకు 48.మొగమా 49.ఎ 50.గతుసు నిలువు: 1.సరిగ 2.మగ 3.కవసం 4.వళి 5.పదం 6.హాచి 7. దాని 8.పతనం 9.జావకి 10.కాద 12.ఆతపం 13.చిరు 14.కేదరం 15.తవం 16.రాజీవము 17.డిరు 18.వేము 19.పావనం 20.మార 21.జీవము 23.పలుము 24.కారాం 25.వనం 26.గాహతి 28.ఆహా 30.గరిత 32. సిద్ధాడుకు 33.మదవతి 35.ఇగు 36.గడప 38.వాకందం 40.కడలు 41.తూనిగ 43.మూకుడు 46.దమా

సరైన సమాధానాలు పంపినవారు: ఎస్. సుభాస్ చంద్రబోసు, సూళ్లూరుపేట; ఎ. ఉపారాణి, నెల్లూరు; గోపీనాథుని వెంకట శేషమ్మ, సిద్ధసకొండూరు; వాస్తు సతీష్‌చంద్ర రామచంద్ర, వాస్తు అంజని రామచంద్ర, నెల్లూరు; వి. కృష్ణప్రియ, మద్రాసు; టి. నిర్మల, తలమంచి; యస్. మమత, పెదపవని; జె. మమత, వేపినాపి; ముప్పాళ్ళ సుబ్రహ్మణ్యం రాజా, గూడూరు; వి.యస్.ఆర్. మూర్తి, ముంబోగిపల్లి, మెదక్ జిల్లా; పాటి సిరశేఖరాచారి, నెల్లూరు. విజేత: ఎస్. సుభాస్ చంద్రబోసు

## మాటలతో ఆట - 36

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | | 3 | | | 4 | 5 | | | 6 |
| 7 | | | 8 | | | 9 | | | | 10 | |
| | | 11 | | | 12 | | | | 13 | | |
| | 14 | | | 15 | | | 16 | 17 | | 18 | 19 |
| 20 | | | 21 | | | 22 | | 23 | 24 | | |
| | 25 | 26 | | | | 27 | 28 | | 29 | | |
| 30 | | 31 | | | 32 | | 33 | 34 | | | 35 |
| 36 | 37 | | | 38 | | 39 | | | | 40 | |
| | | | 41 | | | 42 | | | 43 | | |
| 44 | | 45 | | | 46 | | | 47 | | | |
| 48 | 49 | | | 50 | | | 51 | | | | 52 |
| | | | 53 | | | 54 | | | | 55 | |

**అడ్డం:**

1. అమ్మ పక్షికి వక్ష స్థలం ఎందుకు? (2)
3. ఆ దటి నుండి యుద్ధం రాగండి (2)
4. వేమ పొలములో చిక్కుబడిన వస్త్రం (3)
7. ఇనుడు లాభ్ధిలో లాభం తీసుకోండి (2)
8. నిప్పురు ఇది అంటదు (2)
9. మొలక, కోరికలా ధ్వనించేది (3)
10. అమ్ముకొంటుంటే బాణం (2)
11. వెంట్రుకలున్న అమ్మ దీన్ని ఎట్లా పెట్టినా అందమే (2)
12. వేడిని కొంచెం మార్చు; ప్రార్థించు (2)
13. ఆవాలు దవ్వాలో భార్య (2)
14. ఈ చెట్టునీడ పనికి రాదంటారు (2)
15 అమడ కొన తెగింది (2)
16. తెగులులో కత్తిగాటు (2)
18. తెలుగులో పేజి (2)
20. కూటికి తోడు (2)
21. వాలం ఉంటే మనిషి (4)
23. యంత్రంతో నడిచే పడవ (2)
25. ఒక బాలక్రీడలో దీన్ని కళ్ళకు కడతారు (2)
27. మాట (2)
29. గరం తారుమారు (2)
31. రండోయ్ ఆనిపిలవండి (2)
33. ఆపద (3)
36. పూనకం వస్తే వేసే చిందు (3)
37. శ్రీరంగంలో శ్రీ లేకున్నా అదే అర్థం (2)
38. కయ్యానికి వ్యతిరేకం (3)
40. పక్షి పలుకు (2)
41. చంటి బిడ్డకు పెట్టేది (2)
42. చెట్టుకు పట్టి తెగులు తడబడింది (2)
43. తెలుగులో స్త్రీమరు (2)
45. దేవుడిచ్చేది (2)
46. బీటాబాదు ఊరు (2)
47. మొదటగాడికి ఈ పుష్య అవ్వదాదు (3)
48. పండుల్ని పాడిచే పనిముట్టు (3)
50. సద్దు (2)
53. మిన్నును ఇంచుకమార్చు; శ్రేష్ఠం (2)
54. కుందరదనలో కుంద పద్మ (3)
55. దోగాడులో కాను తీవ్రత (2)

**నిలువు:**

1. అలద్ధిలో సముద్రం (2)
3. ఆపదలో చింత; -మరిచి నిద్రపోండి (2)
4. చేమిరిలో సమీపించడం (2)
5. కలతడ బడింది (2)
6. అగడమ్మలో తప్పట (2)
7. పాలకడలిలో ప్రేమను పట్టండి (2)
8. పాదరక్ష మాట్లాడగలదు (2)
9. వయస్సు (2)
10. బదలిక (3)
11. కోతి కొమ్మంచి ఆటలో స్థిని తీసెయ్యండి (2)
12. వేమనగారులో వెయిపొర్లు (3)
14. గుర్రం (3)
15. ఆజ్ఞప్తికి వికృతి (3)
17. నలాంకొట్టె వాడల్లా బాపనేనా (2)
19. తపాలాశాఖ వారి ఉత్తరాల సంచి (2)
22. ఊరు ఎగుడు దిగుడు (2)
24. కలకాలం (3)
26. అల (3)
28. ముఖం వికృతి (2)
30. నీవి అంటే నీవనాడు; కొకముడి (2)
31. శ్రీరంగంలో పొరికి పొండి (2)
32. -య్యి బొమ్మలు మెచ్చు వారికి కోమలుల సొరక్కునా ?(2)
34. దజనుకు కొంచెం తక్కువ (2)
35. కొత్తకానిది (2)
37. విధవరాలు (2)
39. ముద్దుకు జంటపదం (3)
40. రెండు మూడు దారులు కలిసేచోటు (3)
41. వక్ష స్థలం (2)
43. ఆహారం వికృతి (3)
44. అరుబయట కంటిపాప (2)
45. పరవశంలో అతిమగు (2)
46. వర్తనకాలలో అద్భుతమైన వేషం (2)
49. వ్యతిరేకంలో వృధా (2)
50. లావుకు వ్యతిరేకం (2)
51. అల్లాకు మరొక పేరు (2)
52. వానాడులో దేశం (2)

# అప్పుడు పెదవి విరిచినవారే ఇప్పుడు పొగడ్తలు కురిపిస్తున్నారు !

కమలహాసన్ రూపొందించిన "రాజాపార్వై, సతీ లీలావతి, మహిళలకు మాత్రమే, కురుత్తిపుల్లై" తమిళ చిత్రాలకు ఆయనే స్వయంగా స్క్రిప్టులు రాసుకున్నారు. "నటుడే స్క్రిప్టులు రాసుకుంటే ఎంతో ప్రయోజనం ఉంటుంది. డైలాగులు ఉచ్ఛరించడానికి సులువుగా మలచుకోవచ్చు. దాన్ని అలాగే కంప్యూటర్‌లో ఫీడ్ చేసుకోవచ్చు. అలాంటి సమయాలలో నా భార్య సారిక నన్ను ఏ మాత్రం డిస్టర్బ్ చేయదు. నేను ఆలోచనల్లో మునిగి ఉన్న సమయాలలో ఆమె నన్ను 'సార్' అనే పిలుస్తుంది. మా ఇంట్లో నాకంతటి సహకారం లభిస్తుంది. ఉద్యోగం చేసేవారికి ఉదయం 9 నుంచి సాయంత్రం 6 వరకు పని చేసే కాలం ఉంటే, నాకు ఇరవై నాలుగ్గంటలూ పనే. ఎన్నో ఆలోచనలు. జాగింగ్ మెషిన్ మీద కూర్చున్నప్పుడూ ఆలోచనలే. 'రాజాపార్వై' (అమావాస్య చంద్రుడు) చిత్రానికి కథ ఆ మెషిన్ మీద కూర్చున్నప్పుడే తట్టింది. వెంటనే కాగితాల మీద పెట్టేశా. చివరకి ఆ చిత్రం సూపర్ ఫ్లాప్ అయ్యింది. నా మీద ఆధారపడి కొందరు బతుకుతున్నారు. వాళ్ళ కోసం నేను కృషి చేయాలి. బాలచందర్ గారి దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా పని చేస్తున్నప్పుడే నేను స్క్రిప్టు తయారు చేసే విషయంలో కొంత శిక్షణ పొందాను. నా తొలి చిత్రం "అరంగ్రేటం"లో నేను ముఖానికి రంగు పూసుకున్నప్పుడే డాన్స్ అసిస్టెంట్‌గా పనిచేసిన ఇతగాడు ఏం యాక్ట్ చేయగలడు - అని నాగురించి నలుగురూ అనుకోవడం నా చెవుల దాకా సోకింది. ఇప్పుడు వాళ్ళే నన్ను 'భామనే - సత్యభామనే' చిత్రం గురించి మెచ్చుకుంటూ, నా అంతటి ఆర్టిస్ట్ మరొకరు లేరంటున్నారు. 'నాయకన్' చిత్రంలో నటించే టప్పుడు కూడా నా మీద కొందరి విమర్శ. ఆ చిత్రం జనానికి నచ్చక ఫ్లాప్ అయి తీరుతుందని చాలా మందికి - నిర్మాతతో సహా అనుమానం. దానితో ఆ నిర్మాత మెల్లగా తప్పుకున్నాడు. ఇంకో నిర్మాత ఆ చిత్రాన్ని పూర్తి చేయడానికి పూనుకొన్నారు. ఆ చిత్రం బాగా ఆడింది. మణిరత్నం ఎంతో కష్టపడి డైరెక్ట్ చేసిన చిత్రమది. పూనా ఫిలిమ్ ఇన్స్టిట్యూట్‌లో నటనలో శిక్షణ పొందలేక పోయాననే కొరత నాలో ఉండేది. అక్కడ శిక్షణ పొంది ఉంటే ఇప్పటి కన్నా బాగా నటించే వాడ్నేమో! కొత్తగా 'అమర కావ్యం' అనే చిత్రాన్ని నేనే డైరెక్ట్ చేయడానికి నేను నిశ్చయించాను. ఇందు కోసం అమెరికా వెళ్లి డైరెక్షన్‌లో శాస్త్రీయ పొందాలని ఉంది. ఒక విషయం మాత్రం చెప్పి తీరాలి. నేను డైరెక్టర్ అవతారం ఎత్తితే, నాకు నటుడి కన్నా ఆదాయం తక్కువవవుతుంది. అందుకని డైరెక్షన్ మానుకోగలనా? చూద్దాం - భగవంతుడు ఎలా నిర్ణయించాడో!" అన్నారు కమలహాసన్.

## ప్రభుదేవా చెప్పిన జోక్

ఇటీవల ప్రభుదేవా తండ్రి అయ్యారు. నామకరణోత్సవ సందర్భంలో విచ్చేసిన "మెరుపు కలలు" నాయిక కాజోల్ ఉయ్యాలలో ఆ బిడ్డ చేతులు, కాళ్ళు ఆడించడం చూసి,

### ఎంత ఎదిగినా వినయం వీడని కమలహాసన్ స్వగతం

"అబ్బోవ్ పెద్దయ్యాక మీ అబ్బాయి మీలాగే పెద్ద డ్యాన్సర్ అవుతాడండీ. చేతులు, కాళ్ళు ఎలా ఆడిస్తున్నాడో చూడండి." అందట. "పసి పాప ఇలా కాళ్ళు, చేతులు ఆడించకుండా ఎక్కడైనా ఉంటుందా?" అన్నాడట ప్రభుదేవా. ఆ విషయాన్ని ఆ వేడుకలో కనిపించిన వారందరికీ చెప్తూ, అతను విరగబడి నవ్వుతున్నాడు.

## నాగార్జున కొత్త చిత్రం

"నిన్నే పెళ్ళాడుతా" చిత్రం అనంతరం నాగార్జున నిర్మించే కొత్త చిత్రం పేరు "శ్రీ సీతారాముల కళ్యాణం చూతము రారండి"; దర్శకుడు: వై.వి.ఎస్.చౌదరి.

# నా ఫెయిల్ ఆమె పుణ్యమే!

### విజయనిర్మలపై కస్తూరి విసుర్లు

"తాను రూపొందించిన "రెండు కుటుంబాల కథ" చిత్రానికి నేను డబ్బు వెలదీసి అడిగానని విజయ నిర్మల ప్రెస్ మీట్లు పెట్టి, నన్ను తిట్టిపోసుకుని, నానా రాద్ధాంతం చేసింది. కాని, ఆ చిత్రం మూడు నాలుగు రోజులు కూడా ఆడలేక పోయిందట. ఆ చిత్రంలో నటించి నందువల్ల నాకొచ్చిన నష్టమేమిటంటే - బి.ఎల్ పరీక్షల్లో మూడు సబ్జెక్టులు రాయలేక పోయాను. అటుపై అయినా శ్రద్ధగా చదివి పూర్తి చేయాలి." అంది కస్తూరి.

## కృతఘ్నత

"జెంటిల్‌మెన్, ప్రేమికుడు" చిత్రాలు తమిళంలో నిర్మించిన కుంజామోహన్ "ఈ సినిమా రంగంలో కృతజ్ఞత అనే పదం ఉందటేమో" అన్నారు. ఆయన అంత బాధతో ఈ మాట అనడానికి కారణం - ఆయన మాటలలోనే "నేను తమిళంలో తీసిన 'జెంటిల్‌మెన్, కాదలన్' చిత్రాలను తెలుగులో డబ్‌చేసి, నిర్మాత 'రత్నం' విపరీతంగా డబ్బు సంపాదించారు; సంతోషమే. ఆ డబ్బుతో "ఇండియన్" చిత్రాన్ని నిర్మించి, రెట్టింపు ధనవంతుడయ్యాడు. ఇంకా సంతోషమే. కాని, ఆ 'ఇండియన్' చిత్రం ప్రారంభోత్సవానికి గాని, విజయోత్సవాలకు గాని నన్ను పిలిచిన పాపాన పోలేదు. అంతలోనే నన్ను మరచి పోయాడు ఎ.ఎం. రత్నం. ఈ ఫీల్డు నుంచి రిటైర్ అయిపోవాలని నాకు అప్పుడప్పుడు అనిపించడానికి ఇలాంటి మనుష్యులే కారణం." అన్నాడు విరక్తితో.

## సెన్సారు చేయబడిన కొత్త చిత్రాల పేర్లు

రమా ఫిలిమ్స్ "ముద్దుల మొగుడు", జ్యోతి ఆర్ట్ పిక్చర్స్ "లవ్ ఆట". ప్రగతి పిక్చర్స్ ఇంటర్నేషనల్ "గ్రీన్ కార్డు". శ్రీ రాజ్యలక్ష్మి ప్రొడక్షన్స్ "బావా బాగున్నావా?". భరత్ సినీ మేకర్స్ "ఇండిపెండెన్స్ సోల్జర్". ఎస్.వి.ఎస్. మూవీస్ "అమ్మా నేనున్నాను". లలితా సినీ క్రియేషన్స్ "రాంబోరాజా - ఇంజనీర్ గారి".

## చిట్కాలు

"షూటింగ్ కొసాలా నేను తీసుకొనే ఆహారంలో కొవ్వుల్లు ఉండాల్సిందే. లేక పోతే నామూడ్ అప్‌సెట్ అవుతుంది." అని రంభ అంటే; భానుప్రియ - "నాకు చేపల పులుసు అంటే చచ్చేంత ఇష్టం. అందుకని నేనేం చేస్తానంటే - చేపల పులుసులో ఒక బెండకాయ ముక్క వేసుకొని కలిపితే, చేతికి చేపల వాసన అంటుకోదు. ఈ కిటుకు చాలా మందికి తెలీదు!" అంది.

## కమల్‌లాగా విచిత్రమైన వేషం

"భామనే - సత్యభామనే" చిత్రంలో కమలహాసన్ స్త్రీ వేషం వేసినట్లు ఒక తమిళ చిత్రంలో కల్పన మగ వేషం వేయబోతోంది. "ట్రిక్ షాట్లు తీయించాం. ఎవ్వరూ గుర్తు పట్టలేక పోయారంటే నమ్మండి," అంది కల్పన. ఈ చిత్రానికి ఆమె భర్త అనిల్ దర్శకుడు.

## బాలు పుత్రుడు హీరోగా తమిళ చిత్రం

ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం పుత్రుడు ఎస్.పి. శరణ్ ఒక తమిళ చిత్రంలో హీరోగా పరిచయం గావింపబడు తున్నాడు. ఆ చిత్రానికి ఇళయరాజా రెండో కొడుకు శంకర్‌రాజా సంగీత దర్శకుడు.

సూర్యనేత్ర చిత్రంలో ప్రియారామన్, కనక

### కొత్త ముఖాలతో కొంగ్రొత్తగా వుంది

# కళ్యాణప్రాప్తిరస్తు!

### చిత్రసమీక్ష
### గ్రిద్దలూరు గోపాలరావు

చాలా కాలం తర్వాత దాసరి నారాయణరావుకు మళ్లీ కొత్త ముఖాల మీద మోజు మళ్లింది. తన సొంత కథతో, దర్శకత్వంతో దాసరి ఫిలిం యూనివర్సిటీ పతాకం క్రింద నిర్మించిన "కళ్యాణ ప్రాప్తిరస్తు" చిత్రంలో మూడు లేత కొత్త ముఖాలను పరిచయం చేశాడు. వంశీని హీరోగాను, సుమ, కావ్యలను హీరోయిన్లుగాను నటింపజేశాడు. వంశీ, సుమ, కావ్య టివి సీరియల్స్‌లో చిరపరిచితులే!

కథ పాతది. ప్రేమ ఆధారంగా, ముక్కోణపు పోటీతో కసరత్తు చేస్తూ సాగుతుంది. స్వార్థంతో కూడుకున్న ప్రేమ ఎన్ని పన్నాగాలు పన్నినా ఫలించదని, పవిత్రమైన ప్రేమ కఠినమైన పరీక్షల్లో కూడా నెగ్గి ఫలప్రదమవుతుందన్న సారాంశం కథలో వ్యక్తమవుతుంది.

కథ రెండు చోట్ల మంచి మలుపులు తిరుగుతుంది. ఆ మలుపులు, పాత దనంతో మెలికబడి పోవడం దర్శకత్వ లోపం; అయితే కథనం మాత్రం కొత్త పంథాలోనే సాగింది. అందువల్ల చిత్రంలో హుషారు, కుషీ కనిపిస్తాయి.

నిరుద్యోగిగా వున్న వంశీకి (వంశీ) కెటివిలో పనిచేస్తున్న కళ్యాణి (సుమ) ఆ ఆఫీసులోనే ఉద్యోగం యిప్పిస్తుంది. వంశీ, కళ్యాణిని ప్రేమిస్తాడు. అనుకోకుండా వంశీ, కావ్య అనే అందమైన అమ్మాయిని చూస్తాడు. ఆ అందమైన అమ్మాయిని తన కొత్త టివి సీరియల్‌కు ఎన్నుకోవచ్చన్న ఉద్దేశ్యంతో ఆమెతో సరదాగా మాట్లాడుతాడు. తీరా చూస్తే ఆమె తను పనిచేస్తున్న కెటివి యజమాని (మురళీమోహన్) కూతురని తెలుస్తుంది.

కావ్య, వంశీని ప్రేమిస్తుంది. పెండ్లి చేసుకో నిశ్చయించు కొంటుంది. అడ్డుగా వున్న కళ్యాణిని తొలగించుకొను పన్నాగాలు పన్నుతుంది. ఎలాగైనా వంశీని పెళ్ళి చేసుకుంటానని ప్రతిజ్ఞ చేస్తుంది. తనకు క్యాన్సర్ వ్యాధి సోకినట్లు నటిస్తుంది. అవిధంగా డాక్టర్ చేత చెప్పిస్తుంది. తాను ఎలాగూ ఒక నెలలో చనిపోతున్నాను కాబట్టి వంశీని పెళ్ళి చేసుకొని చనిపోతానని, ఆ తర్వాత నువ్వు వంశీని పెళ్ళి చేసుకొని హాయిగా వుండొచ్చని చెప్పి కళ్యాణిని ఒప్పిస్తుంది. హాస్పిటల్లో బెడ్ మీదనే వంశీ, కావ్య మెడలో తాళి కట్టాడు. ఆ తర్వాత తన నాటకం వెల్లడించి తాను సాధించిన విజయాన్ని ప్రకటిస్తుంది కావ్య. కథలో ఇది ఒక మంచి మలుపు.

కళ్యాణి మరొక యువకుణ్ణి పెళ్ళి చేసుకో దలచింది. ఆ యువకుడు ఒకనాడు కావ్యను మోసం చేసిన వాడు. తన కోసం త్యాగం చేసిన కళ్యాణి అలాంటి మోసగాడి చేతిలో చిక్కుకోవడం యిష్టం లేని కావ్య పరుగున వెళ్లి పెళ్లి పీటలమీద కూర్చొని వున్న ఆ యువకుణ్ణి కాల్చి చంపేస్తుంది. "కళ్యాణ ప్రాప్తిరస్తు" - అని దీవించి కావ్య అదే కళ్యాణ మంటపం మీద వంశీ చేత కళ్యాణి మెడలో తాళి కట్టిస్తుంది. ఇది రెండో మలుపు. ఈ మలుపు పతాక సన్నివేశానికి మంచి పట్టునిచ్చి చిత్రాన్ని రక్తి కట్టించింది.

కొరవ 11 పేజీలో

పెళ్లికొడుకు దుష్యాకుర్తి విజయమోహన్‌రెడ్డి కుమార్తె మమత, రామమోహన్‌రెడ్డి
వివాహం నెల్లూరు టీటీడీలో 18 తేది జరిగింది.

## లోహ విహంగం

మొదటి పేజీ తరువాయి

చుట్టు ప్రక్కల వారందరూ పరుగు పరుగున అక్కడికి వెళ్లి చూసేసరికి – బీభత్స దృశ్యం. లో ..ఉండిన వారి శరీరాలు కాలిపోయి, కమిలిపోయి, ఖండ ఖండాలుగా తెగిపోయి, మాంసం ముద్దలుగా వెల్లాచెదురైనాయి. తెగిన చేతులు, కాళ్లు, రక్తంతో తడిసిన శరీర భాగాలు, మాంసపు ముద్ద కడుపులో త్రవిపినట్లుండిన సన్నివేశమది. ఆ దృశ్యం చూడలేకనే కొందరు గ్రామస్తులు స్పృహ తప్పి పడిపోయా రంటేనే. ఆ విమానంలోని వారి చావెంత విషాదకరంగా వుండిందో అర్థం చేసుకోవచ్చు.

కూలిపడిన విమానం ఆకాశంలోనే పేలిపోవడంతో, ఇనుప ముక్కలు మూడు కిలోమీటర్ల పర్యంతం చెల్లాచెదురుగా పడ్డాయి. ప్రధాన భాగం విరిగి పడిన చోట నేలపై లోతైన గొయ్యి ఏర్పడింది. విమానంలోని సంభాషణలను ఎప్పటి కప్పుడు ఆటోమెటిక్‌గా రికార్డు చేసే కాక్‌పిట్ వాయిస్ రికార్డ్ ఆ శకలాలలో లభ్యమైంది. అది తెరిచి, సంభాషణలు వింటేనే తప్ప, ఆ క్షణంలో ఏమి జరిగిందీ తెలియదు.

ఈ విమానం పైలట్లలో – కుమారి హరితా డియల్ ఒకరు. వైమానిక దళం ప్రప్రథమ మహిళా పైలట్లలో ఆమె ఒకరు. వైమానిక విమానాలను మగవారు మాత్రమే నడప గలరన్న అభిప్రాయాన్ని తుడిచి పెట్టి, పట్టుబట్టి ఎంపికై, విజయ వంతంగా శిక్షణ పూర్తి చేసుకున్న మహిళ ఆమె. వాయుసేన సభ్యురాలిగా యుద్ధ విమానాలూ నడప గలనన్న ఆత్మ విశ్వాసం, నడపాలన్న ఆశలు వుండిన ఆ ఆదర్శ యువతి ఆయుర్దాయం ఇంత అర్ధాంతరంగా ముగియడం దురదృష్టకరం. ఆమె ఛండీగఢ్‌కు చెందిన మహిళ.

హైదరాబాదు దగ్గర దుండిగల్‌లో వైమానిక స్థావరం ఏర్పరచి 28 ఏళ్లయితే – ఇటువంటి దుర్ఘటన జరగడం ఇదే ప్రథమమట.

నెల్లూరు జిల్లా పోలీసులు; నెల్లూరు, ప్రకాశం జిల్లాల కలెక్టర్లు; గుంటూరు డిఐజి ప్రమాద స్థలానికి వెళ్లారు కాని, వారు చేయగలిగింది ఏది లేదు. హెలికాప్టర్లు వచ్చి మంటలు వ్యాపించ కుండా నిలువరించాయి. బుధవారం ఉదయానికి వైమానిక దళాధికారులు అక్కడకు చేరుకున్నారు. రెండు హెలికాప్టర్లు వచ్చాయి. మృతుల శరీర భాగాలన్నింటినీ ఏరి హైదరాబాదుకు తరలించారు. సకల సైనిక లాంఛనాలతో; ఎయిర్ ఛీఫ్ మార్షల్ సమక్షంలో గురువారం అంత్య క్రియలు జరిపించారు. అనవాళ్లే దొరకని మాంసం ఖండాలలో తమ సహచరుల శరీరాలు చూసి దుండిగల్ సైనికులు భోరున విలపించారట.

## జనవాణి

3 పేజీ తరువాయి

అమలు పరిచేదాని కన్నా రాష్ట్ర ఆదాయాన్ని దృష్టిలో ఉంచుకొని నిషేధాన్ని ఎత్తేస్తే బాగుంటుందని కొందరు సలహా లిచ్చారు. అది పూర్తిగా మేధావుల స్వంత ఆలోచన కాదని, ప్రభుత్వమే వారి చేత ఆ విధంగా చెప్పిస్తున్నదని వర్తమాన పరిస్థితులను గమనిస్తున్న ఎవరికైనా అర్థమవు తుంది. ముఖ్య మంత్రి మద్య నిషేధం అమలు విషయంలో మెతక వైఖరి అవలంబి

### అంగట్లో అంగన్‌వాడీల సరకు

పసిపిల్లల్లో పౌష్టి కాహార విలువలు పెంచేందుకు అంగన్ వాడీలకు పంపుతున్న ఆహారం పశువుల మేత కావడం శోచనీయం. అంగన్ వాడీలకు చేరుతున్న రవ్వ బస్తాలు, నూనె, ఉల్లిపాయలు, పోపు గింజలు గ్రామీణ ప్రాంతాల పిల్లలకు చేరడం లేదు. అంగన్ వాడీ ప్రాజెక్టులో పనిచేసే అధికారులు, కార్యకర్తలు వారి స్థాయిని బట్టి వారు మ్రింగ మింగు తున్నారు. ఈ ప్రాజెక్టులో పిల్లల ఆరోగ్య సంరక్షణకు ఒక డాక్టరు కూడా నియుక్తు డవ్వాలి. జిల్లాలో ఎక్కడా ఈ విధమైన ఏర్పాటు లేదు. విదేశాలు దయతో విరాళంగా ఇస్తున్న ఈ పథకం పట్ల జిల్లా అధికారుల అశ్రద్ధ సహించరాని విషయం.

నెల్లూరు డాక్టర్ అన్నపూర్ణ

### రాయి - తురాయి బాగుంది!

డిసెంబరు 13తేది జమీన్‌రైతు సంచికలో రాయి-తురాయి శీర్షిక చదివాను. చాలా బాగుంది. ప్రాచీనాంధ్ర కవులు గాని, నిన్న మొన్నటి తరం కవులు గాని సత్యాన్వేషణా పరులై తాము చెప్పదలచుకొన్న ఇతి వృత్తాన్ని, తామనుకొన్న లక్ష్యసాధన నిమిత్తం జనరంజకంగా పద్య, గద్య రచనల రూపంలో స్పష్టంగా చెప్పారు. వారి రచనలలో సామాజిక స్పృహ, తపన, ఆవేదన, ఏదో చేయాలనే ఆకాంక్ష ఇమిడి ఉండేది. అగ్నిమిత్ర గారన్నట్లు తమ రచనలు కేవలం "అన్పోత్రించే" గారు వారు. తత్ఫలితంగా ఆనందించు వారు పెరిగి పోయిన ఈ రోజుల్లో సాహిత్యానికి దుర్గతి పట్టింది.

నెల్లూరు ఆర్. హనుమంతరావు

## వారఫలాలు

28.12.96 నుండి 3.1.97 వరకు కన్యలో కుజ రాహువులు, మీనంలో శని కేతువులు, ధనస్సులో రవి బుధులు; వృశ్చికంలో శుక్రుడు; మకరంలో గురుడు; కర్కాటక సింహ కన్యలలో చంద్రుడు.

ARIES

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1పాదం)

కొన్ని అనవసర ఖర్చులు చేయవలసి వస్తుంది. వృత్తి వ్యాపార జీవనము కలవారికి ఆదాయము బాగుంటుంది. పనులందు ఆటంకాలు కలిగిన వ్యతిరేక ఫలము లుండవు. వారం మధ్యలో ఆరోగ్య లోపం కలుగు తుంది. అప్పులు హామీలు ఇవ్వరాదు పనికి రాదు. బంధువులతో కలిసి గడపడం, వస్త్రవులు కొనడం జరుగు తుంది. ఉద్యోగులతో మిత్రులతో అభిప్రాయ భేదాలు కలుగ గలవు.

TAURUS

### వృషభం

(కృత్తిక 2,3,4, పాదాలు; రోహిణి, మృగశిర 1,2పాదాలు)

మంచి పనులకు ప్రయత్నాలు చేస్తారు. గౌరవ మర్యాదలు పలుకుబడి బాగుంటుంది. ప్రయాణాలు చేస్తారు. ఉద్యోగ వ్యాపార వృత్తి జీవనము కలవారికి ఆదాయం బాగుంటుంది. కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. ... నిర్ణయాలు తీసుకుంటారు. ఆరోగ్యము కొంత తక్కువ. శ్రమ ఎక్కువగు తుంది.

GEMINI

### మిధునం

(మృగశిర 3,4పాదాలు; ఆర్ద్ర; పునర్వసు 1,2,3పాదాలు)

అన్ని రంగాలలో జీవనం కలవారికి ఆదాయము బాగుంటుంది. వ్యవహారాలు పెరుగుతాయి. కుటుంబ సభ్యుల అనారోగ్యం ఆందోళన కలిగిస్తుంది. చరస్థిరాస్తుల పేచీలు పరిష్కరించు కొనడం మంచిది. బంధుమిత్రులతో విభేదాలు తొందర పాటు నిర్ణయాలు జరుగ గలవు. రావలసిన ఋణములపై వత్తిడి తీసికొని రావడం మంచిది. ఉదరకోశ సంబంధిత రుగ్మతలు కలుగ వచ్చు.

CANCER

### కర్కాటకం

(పునర్వసు 4వ పాదం; పుష్య; ఆశ్రేషలు)

అధికారులతో కూడిన పనులు వెనుకబడ గలవు. వ్యాపార జీవనము కలవారికి ఆదాయము తగ్గుతుంది. వృత్తి ఉద్యోగ జీవనము కలవారికి రాబడి బాగుంటుంది. మీ నుండి సహాయం బాగుంటుంది. పిల్లల విద్యాభివృద్ధి, ఉద్యోగ సౌఖ్యముంటుంది. కోర్టు పేచీలు ఆస్తి పేచీలు పరిష్కరించుకొను అవకాశం లభిస్తుంది. మంచి పనులకు ప్రయత్నాలు చేస్తారు. గౌరవ మర్యాదలు ఆరోగ్యం బాగుంటుంది.

LEO

### సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వపాదం)

ప్రయాణాలు, కుటుంబ శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తాయి. శిరస్సంబంధిత రుగ్మత లుంటాయి. వ్యాపార విస్తరణ, విద్యాలయ కార్యక్రమాలు సుముఖంగా జరుగ గలవు. ఆదాయం బాగుంటుంది. బాకీలు వసూలుకు ప్రయత్నిస్తే మంచిది. కార్య నిర్వహణ శ్రమ ఉంటుంది. అందరు అనుకూలించి సహాయ పడతారు. బిడ్డలకభివృద్ధి బాగుంటుంది.

VIRGO

### కన్య

(ఉత్తర 2,3,4 పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

మంచి వార్తలు వినటం జరుగుతుంది; వృత్తి వ్యాపార ఉద్యోగ జీవనము కలవారికి ఆదాయము బాగుంటుంది. ఇతరుల కొరకు ఖర్చు పెట్టడం, దూర ప్రయాణములు చేయడం, రావలసిన బాకీలు కొంత లభించడం జరుగుతుంది. ఆరోగ్యము వారాంతములో సరిగా ఉండదు. తొందరపాటుతో చిక్కులలో పడతారు. బిడ్డల ఆరోగ్య విద్యావృద్ధులు బాగుంటాయి. క్రొత్త వ్యాపార ప్రయత్నాలు మంచిది కాదు.

**స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.**

LIBRA

### తుల

(చిత్త 3,4 పాదాలు; స్వాతి; విశాఖ 1,2,3 పాదాలు )

కార్య నిర్వహణ సామర్థ్యము, పలుకుబడి బాగుండి గౌరవ మర్యాదలు బాగుంటాయి. అన్ని రంగాలవారికి ఆదాయము బాగుంటుంది. కుటుంబ సభ్యులకు అనారోగ్యము కలుగవచ్చు. శుభ కార్యప్రయాణా లుంటాయి. శ్రమ ఎక్కువగా ఉంటుంది. ఆస్తి తగాదాలు బాకీ తగాదాలను దూరంగా పెట్టండి.

SCORPIO

### వృశ్చికం

(విశాఖ 4పాదం ; అనూరాధ; జ్యేష్ఠ)

ఈ రాశి వారికి ఆర్థికముగా బాగుంటుంది. బంధు మిత్రుల అభినందనలు పొందుతారు. వ్యవహారాలు, చేసే పనులన్నీ అనుకూలముగా ...యి. దూరంగా ఉండే ఆత్మీయులకు డబ్బు వస్తువులు పంపించ వలసి వస్తుంది. ఆరోగ్యము తృప్తికరం. శుభ కార్య ప్రయత్నాలు అనుకూలిస్తాయి. క్రొత్త పెట్టుబడులు వ్యాపార విస్తరణ బాగుంటుంది. సత్కర్మలలో పాల్గొంటారు.

SAGITTARIUS

### ధనుస్సు

(మూల; పూర్వాషాఢ; ఉత్తరాషాఢ 1వపాదం)

కార్యాటంకాలు ప్రారంభములో ఎదురైనా అవసరానికి ఎవరో ఒకరు సహాయపడి నెరవేరుస్తారు. వృత్తి ఉద్యోగ వ్యాపార జీవనము కలవారికి ఆదాయము తృప్తి కరంగా ఉంటుంది. సత్కాలక్షేపణ సాంస్కృతిక కార్యాలలో పాల్గొంటారు. ఆరోగ్యము వారాంతములో తక్కువ. అగాల భోజనము కార్యక్రమ ఉంటుంది. తగాదాలు లేకుండా పరిష్కారాలు వెదకండి. ప్రయాణా లుంటాయి. మంచి వార్తలు వింటారు.

CAPRICORN

### మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు; శ్రవణం; ధనిష్ఠ 1,2పాదాలు )

కుటుంబ సౌఖ్యము బిడ్డల ఉద్యోగ లాభము, పిల్లల విద్యా వృద్ధి ఉంటుంది. వారం చివరలో పనులు నిర్వహణ వెనుక బడుతుంది. బద్ధకత, విసుగు పెరుగుతుంది. వ్యాపార వృత్తి జీవనము కలవారికి ఆదాయము తగ్గుతుంది. ఉద్యోగులు స్థాన మార్పు, అధికారుల నుండి ప్రతికూలత పెరుగు తుంది. కొంత ఋణం చేయాలి.

AQUARIUS

### కుంభం

(ధనిష్ఠ 3,4పాదాలు; శతభిష; పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

పనులన్నీ అనుకూలముగనే ఉంటాయి. అయితే అనవసర ఖర్చులు, గాయములు, ఆరోగ్య లోప ముంటుంది. వస్తు నష్టం అపనిందలు పడవలసి వస్తుంది. వృత్తి వ్యాపార వ్యవసాయ జీవనము కలవారికి ఆదాయము బాగుంటుంది. ప్రయాణ శ్రమ తప్ప ప్రయోజనం ఉండదు. కుటుంబ అనారోగ్య ఆర్థిక సమస్య లుంటాయి.

PISCES

### మీనం

(పూర్వాభాద్ర 4వపాదం; ఉత్తరాభాద్ర; రేవతి)

వ్యాపార వృత్తి జీవనాధారం కలిగిన వారికి ఆర్థికముగా బాగుంటుంది. క్రొత్త పెట్టుబడులకు ప్రయత్నా లుంటాయి. కుటుంబ సౌఖ్యము. సత్కర్మలలో పాల్గొనటం, ప్రయాణాలు జరుగుతాయి. ఆరోగ్యము కొంత లోపమే. బంధు మిత్రుల అధికారుల సహాయ సహకారం బాగుంటుంది. గౌరవ మర్యాదలు కార్య శ్రమ ఉంటుంది.

### లోకాయుక్త అధికారాలు అరం కావడం లేదు

ప్రభుత్వ కార్యాలయాల్లో అధికారులవల్ల అన్యాయం జరిగిన ఉద్యోగులకు లోకాయుక్తను ఆశ్రయించే అవకాశం ఉంది. కాని లోకాయుక్తకు స్పష్టమైన అధికారాలు లేవని పత్రికల్లో ఇటీవల వార్తలు వస్తున్నాయి. ఇది రాష్ట్రంలో ఉద్యోగ వర్గాల్లో సంచలనాన్ని కల్గిస్తుంది. లోకాయుక్త కార్యాలయంలో పని చేసే అధికారులకు కూడా ప్రభుత్వ జి.వోలు తెలిసినట్లు లేదు. వారు సంబంధిత అధికారులకు వ్రాయడం, సంబంధిత అధికారులు ఏదో వ్రాస్తే దానిమీద అన్యాయం జరిగిన ఉద్యోగులకు మెమోలు ఇవ్వడం జరుగుతుంది. లోకాయుక్త అంతటి ప్రముఖ కార్యాలయంలో ఇలా జరగడం బాగోలేదు. జి.ఓ. క్షుణ్ణంగా తెలుసుకొని, తగు నిర్ణయాలు తీసుకొనే స్వేచ్ఛ లోకాయుక్తకు ఉండాలి.

కోవూరు పి. రామారావు

విమాన ప్రమాదంలో నెల్లూరు జిల్లా పరిధిలోని ఆకమ్మపల్లి గ్రామంలో పడిన శకలాలు

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

### చిత్ర కళా ప్రదర్శన

వర్ధమాన సమాజం యాజమాన్యాన 22వతేదీ టౌన్‌హాలులో జిల్లాలోని ప్రముఖ చిత్రకళా కారుల చిత్ర ప్రదర్శన, చిత్ర లేఖన పోటీలు జరిగాయి. 22వతేదీ నుంచి 25వతేదీ వరకు జరిగిన పోటీల్లో ఆయిల్ కలర్ పెయింట్స్, వాటర్ కలర్ పెయింటింగ్స్, గ్లాస్‌వర్క్స్, ఇంక్ స్కెచ్ పెయింట్స్, పెన్ డ్రాయింగ్స్, ప్రదర్శనలో చోటు చేసుకొన్నాయి. ప్రదర్శనను జిల్లా పౌర సంబంధ శాఖాధికారి ఎం. వెంకటరత్నం ప్రారంభించారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభకు సమాజం అధ్యక్షులు పి.వి. రమణారెడ్డి అధ్యక్షత వహించారు. కళాకారులు ఎ. రాజసింహ, ఐ. నాగభూషణం, మునికుమార్, ఎం. సుబ్రహ్మణ్యం, దాశరథి, ఎం. ఒబయ్య, ఎ. గజేంద్ర, టి. సుబ్బరావు, ఎం.వి. ప్రసాద్, షేక్ సిరాజ్, ఎన్. హరినాథ్, ఎన్. శేషయ్య, వై. సురేంద్ర, ఎన్. సురేష్, శరత్ బాబు, పి.వి. ప్రసాద్, పి. రామ్మూర్తి, తమ చిత్రాలను ప్రదర్శించారు. ఈ కార్యక్రమాలను అగస్త్యరెడ్డి వెంకురెడ్డి పర్యవేక్షించారు.

### సాయి సత్య హాస్పిటల్

నెల్లూరు పొగతోటలో సాయి సత్య హాస్పిటల్ ప్రారంభోత్సవం 22వతేదీ ఆకర్షణీయంగా జరిగింది. అత్యంత ఆధునిక వైద్య పరికరాలు కలిగిన ఈ ఆసుపత్రిని మానసిక, శ్వాసకోశ వ్యాధిగ్రస్తులకు పూర్తిస్థాయి చికిత్సా కేంద్రంగా తీర్చి దిద్దుతానని డాక్టర్ సత్యనారాయణ ఈ సందర్భంగా వాగ్దానం చేశారు. ఆసుపత్రి ప్రారంభోత్సవ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ డి. సాంబశివరావు, ఎస్పీ జి. పూర్ణచంద్రరావు, డాక్టర్లు జి. శేషారెడ్డి, సి.ఆర్. రెడ్డి పాల్గొన్నారు. డాక్టర్ సత్యనారాయణకు దక్షిణాది సమితి, అంతర్జాతీయ ఆరోగ్య సంస్థల్లో పని చేసిన అనుభవం వుంది. లాభార్జన ధ్యేయం కాకుండా సేవా భావంతో పనిచేస్తామని డాక్టర్ దంపతులు చెబుతుండడం సంతోషించ దగిన విషయం.

### సోమిరెడ్డి

4వ పేజీ కొరవ

సభలో చంద్రమోహన్ రెడ్డి ఆచి-తూచి మాట్లాడారు. సిఎం నా మీద నమ్మకంతో మంచి శాఖనే అప్పగించారు. ఈ శాఖలతో పక్కాగా పనిచేసి పదిమంది అభిమానాన్ని పొందగలనన్న నమ్మకాన్ని వ్యక్తపరిచా రాయన. తండ్రి రాజగోపాలరెడ్డి, మామ శ్రీనివాసులు రెడ్డి నాకు రాజకీయాల్లో మార్గ దర్శకులు. జిల్లా అభివృద్ధి కోసం చిత్త శుద్ధితో పనిచేస్తా; నెల్లూరులో మెడికల్ కాలేజి స్థాపనకు 3కోట్లు కావాలి. వీటిని ఎన్.ఆర్.ఐలు, జిల్లాలోని దాతల నుండి విరాళాలు స్వీకరిస్తామని మంత్రి వాగ్దానాలు చేశారు. కృష్ణపట్నం ప్రాజెక్టువల్ల జిల్లాలో నిరుద్యోగ సమస్య తీరిపోతుంది. నెల్లూరుకు బైపాసు రోడ్డుతో పాటు పెన్నానది పై మరో బ్రిడ్జి నిర్మాణానికి శ్రద్ధ వహిస్తా నన్నారు. మరో మంత్రి పరసా రత్నం మాట్లాడుతూ సోమిరెడ్డి, నేను మా నియోజక వర్గాలకే మంత్రులుగా పరిమితం కాము. కాని ఎమ్మెల్యేల సలహాల మేరకే వారి నియోజక వర్గాల్లో వేదిరగా వున్నారు. టౌన్‌లో ఘంటాలంగా తయారై వున్న రోడ్లను కొత్త మంత్రి రాకను పురస్కరించుకొని చిన్న చిన్న రిపేర్లు చేయడం కనిపించింది. పోలీసులు అనవసరంగా ట్రాఫిక్‌ను నిలిపి వేయడంతో మంత్రి ప్రజల చేత తిట్లు తినాల్సి వచ్చింది.

## 50ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

పట్టాభి ఉవాచ: తాత్కాలిక ప్రభుత్వంలో గాని, కార్యవర్గంలో గాని ఉన్న ఏ సభ్యునికి స్వాతంత్ర్యేచ్ఛలోను, దేశభక్తి లోను తీసిపోను. రాష్ట్ర పునర్విభజన విషయంలో నేను ప్రజాభిప్రాయాన్ని ప్రతి ఫలింప జేస్తున్నానని పట్టాభి గారు ఆగ్రహంతో జవాబిచ్చారు.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

చిత్రంలో ప్రతి సన్నివేశాన్ని దాసరి నారాయణ రావు శ్రద్ధగా చిత్రీకరించారు. కొత్త నటీ నటులచేత మంచి నటన రాబట్టారు. సుమ, టివి సీరియల్స్‌లోనే మంచి నటిగా పేరు పొందింది. ఆ పునాదిని ఈ చిత్రంలో వదిల పరచుకుంది. కావ్య చిత్రం రెండవ భాగంలో ప్రాధాన్యతను పుంజుకొని బాగా నటించింది. వంశీధ చిన్నపాత్రే అయినా తన మంచి నటనతో గుర్తింపు పొందాడు. , బ్రహ్మానందం, బాబూమోహన్, అలీ, ఏవియస్‌ల హాస్య సన్నివేశాలు, ఒకరి చెంపలు ఒకరు వాయించుకునే ప్రహసనాలు అతిగా వున్నాయి. కథ కవి అంతగా అతక లేదు. పైగా అంతరాయంగా నిలిచాయి. జొన్నవిత్తుల... జేటపల్లి మధు మాటలు ముఖ్య సన్నివేశాల్లో చిక్కగా కుదిరాయి. మురళీ మోహన్, కావ్యతో ఘర్షణ పడ్డ దృశ్యాల్లో మాటలు బరువుగా కుదిరాయి. మురళీ మోహన్ ఆ దృశ్యాల్లో గొప్పగా నటించాడు. భువన చంద్ర పాటలకు కోటి కమ్మని సంగీత స్వరాలు కూర్చటమేగాక తన కంఠ స్వరంతో ఒకపాటని వినిపించాడు. "ఎందంత వెన్నెలాయె", "మనసు గెలుచుకున్న" పాటలు వినతగ్గవి.

చిత్రంలో సాంకేతిక నైపుణ్యం మెచ్చుకో దగింది. చిత్రంలో మొనగాడు సి.హెచ్. రమణబాబు కెమెరా, పాటల దృశ్యాలను, ప్రకృతి అందాలను రమణీయంగా రూపొందించింది.

## 1997కు ఆనంద నీరాజనం

డా. జె.వి. సుబ్బరాయుడు

అర్ధరాత్రివేళ
హాయిగా మురువుగా
అలంకరించుకొని
పాలగ్లాసుతో
మురిపాలొలకపోస్తూ
పడకటింటి ప్రవేశానికి
కొత్త పెళ్ళి కూతురులా
వస్తున్నావా?

జడలు దాల్చుకొని
వికారంగా వికటాట్టహాసం చేస్తూ
భీభత్సం సృష్టించేందుకు
రాక్షసి తాటకలాగా వస్తున్నావా?

క్రోధంతో విషం కక్కుతూ
రణహోమం కాక
మారణ హోమానికి వెళ్తున్న
అశ్వద్ధామ లాగా
కరకు కత్తి చేత బట్టి
ఖూనీకోరులా వస్తున్నావా?

పేరులేక ఊరులేక
అంకెల పేలికలతో వొళ్ళు కప్పుకొని
అర్ధనగ్నంగా
పళ్ళికిలిస్తూ వస్తున్నావా?

ఈ మానవ జీవితాల వొంపు
సొంపుల్ని
చూచేందుకు చిమ్మచీకటి
బురఖా తగిలించుకొని
జాగ్ తేరహో అంటూ
అడుగు పెడ్తున్నావా?
అయినా దొంగలాగానో
దోపిడి దారులాగానో
నైట్ పెట్రోలింగుకు వెళ్ళే
పోలీసు లాగానో
ఎందుకు వస్తున్నావు
మా మధ్యకు అర్ధరాత్రివేళ
నూతన సంవత్సరమా?

ఉషోదయం అంటే నీకు భయమా
వెలుగును నీవు చూడలేవా
నీకు చూపు మధ్యమా
అంతనూ నీవు పుంలింగానివా
లేక స్త్రీ లింగానివా
కాకపోతే రెంటికి చెడ్డ రేవడివా

మా దేశానికి అర్ధరాత్రి వేళనే
స్వాతంత్ర్యం వచ్చింది
పదవులు పంచేందుకు
మూటల కోటలు కట్టేందుకు

రాజకీయాల ఉట్లు పట్టుకొని కొందరు
ఉచ్చనీచాల మెట్లు ఎక్కుతూ
కొందరు
డబ్బు సంచుల పెంపుతో కొందరు
పదవుల కోసం ప్రాకు లాడ్డం
నేర్పింది మాకు
చిమ్మ చీకట్లో వచ్చిన ఘన
స్వాతంత్ర్యం
ఇంకా చీకటి బుద్ధులు పోలేదు
మా స్వాతంత్ర్యానికి

పట్టిమాటలు కట్టిపెట్టి
గట్టిమేల్ తలపెట్టాలనే
మాటలు మా పుస్తకాల్లో
మిలమిల మెరుస్తున్న
మాణిక్యాల మూటలు.

నీవూ వస్తున్నావు మా మధ్యకు
కృష్ణ పక్షంలో అర్ధరాత్రివేళనే
మాకు నీవిపు చూపిస్తావో
బలుపు చూపిస్తావో
సమస్యల విస్తళ్ళువేసి
బాధల స్వీట్లను వడ్డించి
ముచ్చట పడతావో

నీరాక కోసం ఎదురు చూస్తున్న
మా జీవితాలకు వెలుగు నివ్వ
చిరునవ్వులను పండించు
శాంతి సౌఖ్యాల విరులు పూయించు
మరలా వచ్చే డిసెంబరు నాటికి
నీవు పాత బడ్డ సంవత్సరానివి
కావద్దు
మూలబడ్డ సంవత్సరానివి కావద్దు
మైలబడ్డ సంవత్సరానివి అసలే
కావద్దు
నిన్ను మరువలేనంతగా
మమ్మల్ని అలరించి అదరించు
సింగరు - అద్దంకి సామెతకు
అద్దం పట్టి నిలువకు
కొత్త సంవత్సరమా
నీకిదే మా హార్దిక స్వాగతం
మా ఆనంద నీరాజనం

***

మీ స్వప్నాలకు, ఆశలకు ప్రతిరూపం — ఆశయాల ప్రతిబింబం 'కృపాంజలి'




# కృపాంజలి చిట్స్, ఫైనాన్స్ & ఇన్‌వెస్ట్‌మెంట్స్ (ప్రై) లిమిటెడ్

రిజిష్టర్ నెం. 01–25302/96–97
15/718, రాజీవ్‌గాంధీ రోడ్డు, జేమ్స్ గార్డెన్, ఆత్మకూరు బస్టాండు దగ్గర, నెల్లూరు – 524 002

అందమైన ఈ చిన్ని ప్రపంచంలో – పగలు రాత్రి కష్టపడ్డా మీ ఆశలు, ఆర్థికావసరాలు తీరలేదని నిరాశ నిస్పృహలు తప్ప మిగిలిందేమి లేదను కోకుండా ఎవరినో నిందించక ఒక్క క్షణం ఆలోచించండి "కృపాంజలి" లో సభ్యత్వం తీసుకోండి. మీ జీవితాన్ని ఆనందమయం చేసుకోండి. కృపాంజలి తోడుంటే మీ జీవితమంతా శుభఘడియలే.

**మీ నమ్మకమైన కొత్త నేస్తం–కృపాంజలి**

మా సంస్థ అందించు వివిధ రకములైన చిట్ గ్రూపుల

| చిట్ విలువ | నెలలు | సభ్యులు | నెలసరి వాయిదా | ప్రవేశ రు |
|---|---|---|---|---|
| 10,000 | 25 | 25 | 400 | 50 |
| 10,000 | 20 | 20 | 500 | 50 |
| 15,000 | 20 | 20 | 750 | 70 |
| 15,000 | 15 | 15 | 1,000 | 70 |
| 25,000 | 25 | 25 | 1,000 | 80 |
| 25,000 | 20 | 20 | 1,250 | 80 |
| 50,000 | 25 | 25 | 2,000 | 160 |
| 50,000 | 20 | 20 | 2,500 | 160 |
| 1,00,000 | 40 | 40 | 2,500 | 225 |
| 1,[illegible],000 | 25 | 25 | 4,000 | 225 |

## మా సంస్థ అందించు ఆకర్షణీయమైన డిపాజిట్ స్కీములు

### 1. షార్ట్ టర్మ్ డిపాజిట్లు (Short Term Deposits)

కనీస మొత్తం : రూ. 3,000/-
కాలపరిమితి : 30 రోజుల నుండి 1 సం. లోపు
వడ్డీరేటు : 21% (ప్రతినెలా చెల్లించబడును)

### 2. క్యుములేటివ్ డిపాజిట్లు (Cumulative Deposits)

కనీస మొత్తం : రూ.5,000/-
కాలపరిమితి : 1 సం. ఆపైన
వడ్డీరేటు : 24% (మూడు నెలలకు ఒకసారి చెల్లించబడును)

### 3. ఫిక్స్‌డ్ డిపాజిట్లు (Fixed Deposits)

కనీస మొత్తం : రూ.10,000/-
కాలపరిమితి : 33 నెలలు
వడ్డీరేటు : 27% (డిపాజిట్ మొత్తం రెట్టింపుగా చెల్లించబడును)

### 4. కృపానిధి డిపాజిట్లు (Krupanidhi Deposits)

ఎ) ఈ డిపాజిట్ నందు 'నిర్ణీత' మొత్తమును మీరు నిర్ణయించుకొను 'నిర్ణీతకాల పరిమితి' వరకు ప్రతినెలా చెల్లించ వలయును.

బి) డిపాజిట్ కాలపరిమితి 12 నెలలు, 24 నెలలు

| నెలనెలా చెల్లించు మొత్తం | మెచ్యూరిటీ మొత్తం | |
|---|---|---|
| | 12 నెలలకు రూ. | 24 నెలలకు రూ. |
| 100 | 1,350 | 3,030 |
| 200 | 2,700 | 6,060 |
| 300 | 4,050 | 9,090 |
| 500 | 6,750 | 15,150 |
| 1,000 | 13,500 | 30,300 |

**గమనిక :**

1. అన్ని డిపాజిట్లకు నామినేషన్ సదుపాయము కలదు. 2. పై అన్ని డిపాజిట్ సదుపాయములలోను మీరు వద్దనుకున్నప్పుడు వెంటనే రద్దు పరచుకొనవచ్చును. 3. కాలపరిమితిలోపు రద్దు పరచుకొను డిపాజిట్లపై 3% వడ్డీ మినహాయించి చెల్లించబడును

## బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్

చైర్మన్
కోట సంజీవ్ కుమార్,
M.Sc. Tech.

మేనేజింగ్ డైరెక్టర్
మేడా సురేష్‌రెడ్డి

డైరెక్టర్లు :
పాపారెడ్డి మనోజ్‌కుమార్ రెడ్డి,
మేడా శ్రీనివాసులు రెడ్డి

**KRUPANJALI CHITS, FINANCE & INVESTMENTS (P) LTD., NELLORE**

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Navagara Paper Products (India) Limited, Nello